శ్రీ రామ

# సౌభ్రాత్రరాఘవము



గ్రంథకర్త

పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు.





ప్రకాశకులు

రెడ్డి సోదరులు

రాయవరము ❀ రాజమండ్రి

తూర్పు గోదావరిజిల్లా.

1932

[రిజిష్టరు చేయఁబడినది] [వెల 10 అణాలు.

# విషయసూచిక



శ్రీరామ.

# సౌభ్రాత్ర రాఘవము

## —:రాఘవుల బాల్యము:—

త్రేతాయుగమున నయోధ్యాపురమును రాజధానిగాఁ జేసికొని కోసలదేశమును బరిపాలించుచుండిన దశరథ మహారాజునకుఁ గౌసల్యా కైకేయీ సుమిత్రలను మువ్వురు పత్ను లుండిరి.

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం
డైనట్లు నారాయణాం
శమునంబుట్టె మదాంధ రావణ శిర
స్సంఘాత సంభేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం
గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యక తుల్యకంచిత జను
స్సంసార సాఫల్యకున్.

సుజనలాభరతుని భరతుని గైకేయి గాంచె. సకల శుభలక్ష్మణుఁడు లక్ష్మణుఁడును నంతఃశత్రుఘ్నుఁడు శత్రుఘ్నుఁడును గవలై సుమిత్రకు జనియించిరి. లేక లేక కలిగిన నవలావణ్యజితమారులఁ గుమారులఁగని దశరథుం డమందా

నంతంబున బీదసాదులకు సన్నవస్త్రాదు లొసంగి పలువిధ ధర్మకార్యంబు లొనరించి బ్రాహ్మణోత్తములఁ దృప్తులఁ గావించి జాతకర్మ నామకరణాదుల జరపెను. ఆ సుకుమారులగు రాకుమారులు జననీజనకులకు నయనానందకరంబుగఁ బ్రవర్ధమానులై పంచవర్షప్రాయులైరి. తండ్రి కొడుకులకు సుముహూర్తంబున విద్యాభ్యాసము చేయించెను. కులగురుండగు వసిష్ఠునొద్ద నక్కుమారకంఠీరవులు క్రమంబుగ నెల్లవిద్యలయం దారితేఱిరి. పదునొకండవయేఁట నుపనీతులై వేదాధ్యయనంబు చేసిరి.

అందు రాముండు వర్ణిధర్మంబుల సడలనీక గురుశుశ్రూషయొనర్చుచు నుపాధ్యాయుండు సుడువు నుడువులఁ గడుజాగరూకుండై విని తదర్థంబు గ్రహించి సమయ మబ్బినపుడెల్లఁ బ్రాంత పాఠములఁ జింతనసేయుచు సర్వశాస్త్రములం దఖండ పాండిత్యము సంపాదించి నీతిశాస్త్రమునం దభిరతుండై ధర్మశాస్త్ర పరిజ్ఞాతుండై ధనుర్విద్యాపారంగతుండై శత్రుమర్మభేదనవ్యూహ నిర్మాణంబునను ద్వంద్వయుద్ధకర్మంబునను జిత్రశస్త్రాస్త్రప్రయోగ నైపుణ్యంబునను శత్రుమిత్రోదాసీనుల సామాద్యుపాయంబులఁ జక్కఁబఱచుటయందును సంధివిగ్రహయానాసనద్వైదీభావ సమాశ్రయంబుల దేశకాలపాత్రంబు లెఱింగి జరపుటయందును గజహయాద్యధిరోహంబునను సము లితనికి లేరనిపించుకొని

కళంకరహితుండగు శశాంకుని పోంకంబున నతను త్వరహిత కుసుమశరుని కరణి లోకమోహనాకారుండై లీలావిహార చాతుర్యంబుల నిఖిలజన మనోభిరాముండై సకల సద్గుణ ధాముండై రాముండు సర్వజనప్రియవర్తనంబున జనక హితుండై పురుషశ్రేష్ఠుండయ్యెఁ బితృశుశ్రూషణరతుండై శ్రుతివిదుండయ్యె బ్రహ్మణ్యుండై ధీరుండయ్యె గురుజన విధేయుండై శూరుండయ్యె శాంతుండై గంభీరుఁడయ్యె మాతాపితృ భీరుండై బ్రహ్మచారియయ్యెఁ గీర్తికామినీ మోహనుండై ధీరుండై ఘనసుగుణోదారుండై యతిరథుఁడై బుధహితుఁడై విబుధనుతుఁడై, కౌసల్యాదశరథుల పున్నె ముల ప్రోవై యలరారుచుండె. లక్ష్మణుండు శ్రీరాముని సుగుణగణములకు వశుండై తోడునీడంబోలె నతని నెడఁ బాయకుండువాఁడు.

—:విశ్వామిత్రాగమనము:—

ఒకనాఁడు పరమతపోనిధియుఁ ద్రైశంకవునకుఁ బదు నాలుగు మన్వంతరము లిం ద్రు సర్గసింహాసన మిప్పించిన మహామహిముండును సన్వర్థనాముండును బవిత్రుండు నగు విశ్వామిత్రుండు దశరథునాస్థానంబున కరుగుదేర, నతఁ డెదురేగి సవినయముగ సాష్టాంగనమస్కృతి చేసి సంప్రీతి మెయిఁ దోడితెచ్చి యుచితాసన మిచ్చి హితోపచారం బులు సలుపుచు నిట్లనియె. "మహాత్మా! తనయులఁబడసిన

నాఁటికంటె నేఁడు భవదీయాగమనంబునంజేసి ప్రమోద లాభంబునుమఱించె. ధన్యుఁడ నైతి. నియతాత్ము లిట్టియెడ కూరకరారు. కార్యంబేదేనున్న నన్ను నియోగించి యేతత్కార్యసాఫల్య పుణ్యంబునకుఁ బాత్రునిఁ జేయుఁగదే!" అనుడు విశ్వామిత్రుఁ డిట్టులను.

"రాజచంద్రమా! మనుకులసంజాతుండవు, మాంధాతృ హరిశ్చంద్ర భగీరథ ప్రముఖ నిఖిలలోక కీర్తనీయులు నీకాలమువారల. వసిష్ఠకృతోపదేశసంజనిత లసద్వివేకుఁడ వైన నీకిది యనురూపంబకదా! ఏనొక మహాధ్వర మొనర్ప దీక్షగైకొని మద్వనమున హోమాగ్ని వ్రేల్చుచుండ నిద్దఱురక్కసులు కామరూపులై రక్తమాంసశల్యాదులు వేదియందుఁ గుత్తుకబంటి నింపి చలపట్టి పెక్కుసారులు విఘ్నమాపాదించిరి. చిరార్జిత తపఃఫలంబు వ్యర్థంబగునను చింతచే శాపాయుధుఁడ నిరాయుధుఁడ నగుచున్నాను. రవికులాబ్ధిసోము సుగుణాభిరాము నళివిరాము రాము నావెంటఁ బంపుము. అతనిచేఁ దక్క నితరులచే నారక్కసులు నిర్జింపఁబడరు. "దశరథా! కాదనక నీకుమారు నా కిమ్ము. అతనిసాయంబున నాయాగంబు నెఱవేఱఁగలదు"

నావుడు ధరణీధవుఁ డదరిపడి "మునికులతిలకా! ఇదేటిన్యాయము. కన్నులు దెఱవని చిన్నికూన! తల్లి యెడఁబా టోర్వలేనివాఁడు! విల్లునమ్ములు చక్కగ సజ్యము

సేయనేరఁడు! అకృతాస్త్రుఁడు! యుద్ధక్రమము లెఱుఁగఁడు! పండ్రెండేండ్లైన నింకను సరిగ నిండని సుకుమారుఁడగు రాముఁ డెక్కడ! వికారాకారులగు రాకాసులఁ బిలుకుమార్చు టెక్కడ! ఆ రక్కసులఁ గని దిక్కుదెలియక బిక్కిరింపఁగలఁడు. తమ వాక్యములఁ దలంచుకొన్న నా యొడలు కంపమెత్తుచున్నది. నా పంచప్రాణములును రాముఁడే. అట్టి రాముని విడిచి గడియయైనఁ బ్రాణముల భరింపఁజాల. ఈ కోర్కె యుడుగుమా! సర్వసైన్యసమేతుఁడనై వచ్చి మీ యజ్ఞంబు నిర్విఘ్నంబుగాఁ బరిసమాప్తి నొందింతు" అని పరితపించి బ్రతిమాలు నృపాలుం గని మునిపతి యిట్లనియె.

"శ్రీరాముండు సత్యపరాక్రముండు. లోకహితుఁడు. మహామహిముఁడు. పుత్త్రమోహాంధుండవైన నీ వెఱుంగ లేకున్నావు. నీ గురుండు వసిష్ఠుం డెఱుంగును. రాముని చేఁ గాని యా మారీచ సుబాహులు మడియరు. రాముఁడు లోకహితుఁడు గాని నీ సుతుఁడు గాఁడు. లోకహితుఁడుగాక నీ సుతుఁడైనంతన గల్గు ప్రయోజన మేమి? ఎద్దానివలన నితఁడు ధన్యతముఁడని విఖ్యాతి వడయునో యట్టి దివ్యానేకరూప యశంబు నొసంగెద. నీకు రామునిపైఁ గల పుత్త్రమోహంబును వదలుము. రాక్షసుల హతులఁగాఁ దలంపుము. రాముని కీర్తి కాంతాపాణిగ్ర

హాణ శుభసంకలనమున కడ్డురాకుము. ఆ నిశాటులు సామాన్యులని నీ రాక నిశ్చయించితివి. వారు సుందనందనులు. హుంకారమాత్రపలాయిత బృందారకులు. రావణు పంపున సత్కార్యధ్వంసనమునకై పఱతెంచువారు"

అనినఁ బుడమిపతిఁ దెల్లబోయి మునికుంజరున కంజలి గీలించి "కుశికపుత్త్రా! రావణుఁడు సమరజిత్తైరావణుఁడు. వైరిదారాగర్భ నిస్రావణుఁడు. వాని పంపుసేయు మారీచ సుబాహులు మాయాబలదేహులు. యజ్ఞాది పుణ్యకర్మ విఘ్న పాప సందోహులు. వారి విదారింప నాచే నేమి? బృందారకులచేఁ గాదు. సుకుమారుఁడు కుమారుఁ డెట్లోపు? సర్వజ్ఞుండవు. మద్గురు దైవస్వరూపుఁడవు. మందభాగ్యుండనైన నన్నుఁ గరుణించి రాముని యందుఁ బ్రసాదంబు సేయుము" అని బతిమాల విశ్వామిత్రుం డత్యాగ్రహంబున యజ్ఞాయతనంబునఁ బూతాజ్యసిక్తాగ్నిభంగి మండుచు నరుణీకృతలోచనుండై "దశరథా! మొదటనే లేదని యన్నచో నెంతయు నొప్పిదమైయుండు. ఇచ్చెదనని గర్వోక్తులు వల్కి తుది బొంకితివి. తరణికులంబునఁ దప్పుఁబుట్టించితివి. నీచే దినకులము కలుషితమయ్యె. నిను నమ్మి యడిగిన మా కింతలయ్యె. మృషావాదినై దారాపుత్త్రులఁ గూడి పెద్దకాలంబు మనుము. ఏరీతినైన సత్కార్యము లిఁకఁ దుదిముట్టవే?" యని యటనిలుచక నడిచె.

గాధేయు దుర్నివారక్రోధరసోదీర్ణంబైన రూపలక్ష ణంబు లుపలక్షించి ధర్మజ్ఞ శిశిష్టుండగు వసిష్ఠుండు కార్య ము మించెనని తత్తఱపడి దశరథుం గాంచి యిట్లనియె.

ఉ. "ప్రాకటధర్మమూర్తి వతి
బంధుర సత్యయశోధనుండ వి
క్ష్వాకు కుల ప్రసూతుఁడవు
సమ్మతినిచ్చెద నంచుఁ బల్కి నీ
చాకృతి నీకు బొంకుటది
యర్హమె? బొంకిన సర్వధర్మముల్
వేకడ తేఱిపోవె? యురు
విశ్రుతకీర్తియు మాసిపోవదే?

ఈ గాధినందను మహిమంబు లమేయంబులు. శివుని మెప్పించి యనేక మోఘాస్త్రంబులఁ బడసినవాఁడు. ముజ్జగములఁ గల దారుణాస్త్రంబులు సర్వం బితని కెఱు కయై యుండు. నాతోఁ బ్రతిఘటించి బ్రహ్మర్షి యయ్యె. ఇంద్రుపై నలిగి ప్రతినాక మొనరించె. తపోవిఘ్నకారణ విజృంభ మైన రంభను ఱాయిగఁ దిట్టె. యాగపశువుగఁ గొనిపోఁబడు శునశ్శేఫుని బ్రదికించె. ఇట్టి తపోధనుని వెంట రాముం బంపుట శుభప్రదంబ. బ్రహ్మర్షి రక్షితుఁడగు నీ సుతు నగ్నిచక్రంబుచేఁ బరిరక్షితమైన యమృతంబుభంగిని రాక్షసులు సాధింపంజాలరు. తాన దానవుల సాధింప

శక్తుఁడయ్యు రామున కధిక కల్యాణం బొసంగఁ దలంచి యపారకృపాతిరేకమ్మునఁ జనుదెంచినవాఁడు. సందియంబు డెందంబునఁ జెందనీక నా వచనంబు నమ్మి వేగ రాము నంపుము. పొమ్ము. మునిం బ్రసన్నుం జేసికొని తోడితెమ్ము"

వసిష్ఠ ప్రబోధితుఁడై పంక్తిరథుండు వడి వడి నడచి జడదారి యడుగుల కెఱఁగి "నా యపచారంబు మన్నింపుఁడు. రాముం దోడ్కొనిపొండు విచ్చేయుఁ" డన విశ్వామిత్రుండు కొంత బిగువు వదలక "రాజేంద్రా! నీ మాట నమ్మంజనదు. నా దారి కడ్డురాకుము. లోకంబున రాజులు గొడ్డువోయిరేమి?" యని తొలఁగిపో నుద్యమింప దశరథుండు "భవత్పాదసేవకులపై నింత యలుక యేల? పుత్త్రమోహంబునఁ బలికిన పలుకులఁ గరుణ మెయి మన్నింపుఁడు" అని మఱి మఱి ప్రార్థించి "యిప్పటి దత్తాపహారంబునకుఁ బ్రాయశ్చిత్తంబుగ లక్ష్మణుం దోడుచేసి పంపుదే?" యను నతని పలుకుల కలరి "మహాత్మా! నే గోరనుండిన వర మద్దియ. దానిం బాపపరిహారకంబుగ దయచేసితిరి. కృతార్థినైతి" నని యతనిం దోడ్తెచ్చి రాజసుత్రాముని రాముని నగ్రజహితపక్షుని లక్ష్మణుఁ బిలిపించి తొడలపై నిడికొని కూఁకటి దువ్వి శిరంబు మూర్కొని "నాయనా! రామచంద్రా! నా చిన్నియన్నా! నిన్ను మునిచంద్రుండు దోడ్కొనిపో వచ్చియున్నాఁడు!

అతని వెంట ననుజునితోఁ జని యాఁగాదనక యతని ముదల నౌదల ధరింపుము. నీకు శుభంబగుత! పోయిరమ్మా” అని ముదమారఁ గవుంగిలించి దీవించి ప్రతాపసాంద్రుని జననుతరూప నిర్జిత వసంత జయంత రతీంద్ర చంద్రుని ననుపమ భోగభాగ్య విజితా నిమిషేంద్రుని రామచంద్రుని మహర్షి చంద్రుని కరంబున నిడి “మహాత్మా! తల్లుల నెడఁబాసి యుండలేరు. ఆఁకలి దప్పులెఱుఁగరు. ఎండకన్నెఱుఁగరు. ఇంతయేల? నాబిడ్డలుగారు. నీబిడ్డలు. నీభార” మని పయనంబుచేసె. శ్రీరామ లక్ష్మణులు తల్లిదండ్రులకు నమస్కరించి యాశీస్సులంబడసి పీతశోణవస్త్రంబుల ధరించి కొండియలకుఁ గుసుమమాలికలుచుట్టి తిరుగా నామంబులు దీర్చి విశాలవక్షంబుల సురుచిరమణిహారములు వెఱయ,

మ. అతులోత్సాహ ధురీణులై పటుతర
జ్యాంతర్ధనుఃపాణులై
తతగోధాంచిత భర్మనిర్మిత భుజ
త్రాణాంగులీ త్రాణులై
యుతబాణోన్నతతూణులై బిరుదకే
యూరాఢ్య దోస్థాణులై
ప్రతతస్ఫీతకృపాణులై త్రిభువన
త్రాణైక పారీణులై.

మంగళవాద్యములు మ్రోయ “భూభారంబు దీర్పఁ గోదండపాణి వెడలె” నని వామదేవాదిమునులు జయవెట్ట,

నూరివా కాబాలగోపాలంబు స్వకార్యవిరహితులై చను దెంచి కాంచి వారి సౌందర్యసుధను నేత్రాంజలులఁ గ్రోలి సాక్షాత్ యోగులపోల్కి నిమీలితనేత్రులై నిలువఁ, బినాకి వెంటఁ జను వినాయకకుమారులు నాఁగ విశ్వామిత్రుని వెంట దశరథకుమారులు నడచెంచిరి.

సాయంతనమునకు వారు సరయూతీరముం జేరిరి. అట వారల స్నాతులంగావించి బలాతిబలవిద్య లుపదేశించి యందువలన జరయురుజయుత్క్షుత్తృష్ణలుఁ జేరవని కౌశికుం డా రాత్రి రాఘవులతో నచ్చటఁగడపి మఱునాఁ డరుణోద యంబునకు మున్న లేచి "కౌసల్యాసుపుత్రా! రామా లెమ్మా. పూర్వసంధ్యపరఁగెడిని! ఆహ్నికక్రియలందీర్పు" మని ప్రబోధింప రామలక్ష్మణులు లేచి నిత్యకృత్యముల నిర్వర్తించి మునికి నమస్కరించి పయనము సాగించిరి.

మార్గమున వారికి విశ్వామిత్రుండు పథిశ్రమాప నోదనముగ నయ్యై స్థలవిశేషములఁదెలుపుచు గంగాసరయూ మధ్యదేశంబున మఱునాఁటిరాత్రి గడపి యుదయమున మరలఁ బయనించిరి. పోఁబోనొకచోఁ బ్రావృట్కాల మేఘగర్జాసముజ్జృంభితంబైన యొక్క నిర్ఘోషంబు వినంబడ "నది యేమికారణంబున నుత్పన్నమయ్యెఁ దెలుపవే" యని యడుగు రాట్కుమార కంఠీరవులకు ఋషివృషభుం డిట్లనియె: "పూర్వము లోకేశ్వరుండు కైలాసాద్రియందు మన

స్సంకల్పమాత్రంబున నొకసరస్సు నిర్మించె. అదియ మానస సరోవరంబునాఁ బ్రఖ్యాతినొందె. అసరసియందు సముదితయై సరయువు సాకేతపురముం దిరిగివచ్చి జాహ్నవియందిచ్చట సంగమించుచున్నది. తత్సంగమస్థల సంభూత ఘనతరంగ ఘట్టనోద్భూత రవంబది" అనుజయుతుండయి రాముం డమ్మహానదికిం బ్రణమిల్లి దాని నుత్తరించి పోవంబోవ సూర్యకిరణములకేఁ జొటీక సాంద్రతరువిటపపలాశపటల పరిచ్ఛన్నంబైన యొకవనంబు గన్పట్టుటయు మునీంద్రునవలోకించి రాముఁ డిట్టు లర్థించె.

"మహాత్మా! ఇది యేమిచిత్రము! మత్తశుండాల ఘీంకృత సంకలితంబై సింహ శార్దూల వరాహ నిర్ఘోష భీషణంబై పంచాస్య నఖవిదారిత మదవేదండ కుంభ పరిపాత ముక్తాఫల విరాజితంబై ఝిల్లికానాదితంబై బదర్యశ్వకర్ణాది కంటకతరు నికుంజపుంజ సంకీర్ణంబై దుష్ప్రవేశంబై యున్నయది. దీని వృత్తాంతం బెఱింగింపవే" . యనుడుఁ గౌశికుం డిట్లుత్తరమిచ్చె.

—: తాటక వధ :—

"నాయనా! గిరిసంకాశుండగు వృత్రుండు తొల్లి ఘోరముగఁ దపంబు గావింప నింద్రుండు శతకోటిచే వాని మస్తకంబు దెగవేసె. దానంజేసి బ్రహ్మహత్య బిడౌజునకుఁ ప్రాప్తింప దేవతలు తాపసులు పెక్కువిధములఁ జింతించి

వృత్రశత్రు నిటకుఁ దోడ్తెచ్చి యతని యంగంబులఁ గల శతటినీజలంబులఁ జలికి బాధకంబైన నిర్జరాధిపుని గాత్ర కలిత మలకరూశంబుల నిచట విడిచి చనిరి. అప్పటినుండి యీ ప్రదేశంబులు మలదకరూశనామంబులఁ బ్రసిద్ధికెక్కె. పిదపఁ దాటక యను యక్షిణి మాయాబల విహారి యగు మారీచుఁడను కుమారునితోఁ గలసి యీ ప్రదేశంబులం జొచ్చి జనవినాశంబు నొందింప నిది విజనీకృతంబయ్యె. అయ్యక్షిణి సార్ధయోజనమాత్ర దూరంబునఁ గాంతార మార్గంబు గాచి తపోధనుల హించించుచు యాగంబుల ధ్వంసించుచు దుష్టచారిణియై మెలంగుచున్నది. దాని జఠరంబునఁ గోటానకోట్ల జీవులు జీర్ణించిరి. ఆ తాటకను వధించి యీ ప్రదేశంబును నిర్బాధకంబుగఁ జేయు” మన వుడుఁ జనవుపెంపున రాముండు మరల విశ్వామిత్రుం బల్కె “తాతా! యక్షు లల్పసత్త్వలని విందు. అందు నబల కిట్టి బలం బెట్లబ్బె. తెలుపవే!” యన నధికప్రేమమున రామునకు విశ్వామిత్రుఁ డిట్లనియె.

వత్సా! తొల్లి సుకేతుండను యక్షుండు తన యార్థియై విరించిం గుఱించి తపంబు సేయఁ బంకజాసనుండు ప్రసన్నుండై తనయాభిలాషికిఁ దనయునీయక తనయాలాభంబు దయచేసి యామెకుఁ దాటకాభిధానంబుతో సహస్ర నాగసత్త్వం బొసంగి యంతర్హితుండయ్యె. పిదప సుకే

తుండు తన కుదితమైన కూఁతును ఝర్ఝపుత్త్రుండగు సుందునకుఁ బత్నిగాఁ జేసె. వారికి నీచుండగు మారీచుండును విస్తృతదేహుండగు సుబాహుండును బుట్టిరి. అనంతరము కొంతకాలంబునకు సుందుండు గతింపఁ దల్లి బిడ్డలు క్షుత్పీడితులై తిరుగుచు నొకనాఁ డగస్త్యుని గని గర్జించుచు భక్షార్థం బతనిపైఁ గవిసిన నతండు వారలనుఁ దిండులుగండని శపించె. అది మొదలుగ వీరీ వృత్తి నున్నవారలు. వీరి నిర్జింప నీవుదక్క నొండొరుఁడు చాలఁడు. స్త్రీయని యనుమానింపకుము. దుష్టవర్తనంబున జరించు స్త్రీనైనఁ బురుషునైన వర్ణాశ్రమ ధర్మరక్షణార్థమై కడతేర్చుట తప్పుగాదు. మున్ను విరోచన నందన యైన మంథర వసుంధరాద్రోహ మొనర్పఁబూన మఘవుం డామెను దెగటార్ప లేదే? జగంబపాకసూదనముగఁ జేయఁ బ్రయత్నించిన యధర్మవిచారిణిని భృగుపత్నిని జనార్దనుండు సమయింపఁడే? కావున సంశయంబు వదలి తాటకం జంపి లోకంబునకుఁ గల్యాణంబు సంపాదించి కీర్తివడయుము" అని హెచ్చరించిన యప్పలుకులు విని మందహాసరోచులు మొగమున మొలకలెత్త రాఘవుండు మునిపుంగవున కిట్లనియె.

"తాతా! తండ్రి, గురు సమక్షమున నీ పంపుసేయుమని యానతిచ్చె. తండ్రియాజ్ఞ మీఱువాఁడు తనయుఁడే? [illegible]దాజ్ఞాబద్ధుఁడ. దానవి నిప్పుడ వధించి గోవిప్రవర్గంబు

లకు మేలు సమకూర్చెద" అని కోదండంబు ముష్టినలవ రంచి తీవ్రంబుగ గుణప్రణాదంబు సేసినఁ దద్ఘోరనాదము కర్ణకఠోరముగాఁ గ్రోధ వివశాత్మయగుచుఁ బర్వతోపమా కారంబున వివృతాస్యయై దుష్టఘటకయగు తాటక పఱ తెంచె,

ఉ. పాటితదుష్టసత్త్వ వన
వాటక సిద్ధ బలావరుద్ధ శృం
గాటక గ్రంథిలభ్రుకుటి
గాఢ లలాటకఁ గ్రూరతారకా
నాటక నాంత్రకాంచి పరి
ణద్ధ శవప్రపతత్కిరిమిచ్ఛటా
కీటక రక్తసిక్త పటు
ఖేటకఁ దాటకఁ గాంచి రయ్యెడన్.

శ్రీరాముఁడు లక్ష్మణున కా దుష్టనిశాటిం జూపి "కంటే లక్ష్మణా! ఆ వికృతాకారను! కనుఁగొన్నమాత్రన యలఁతి వారిగుండియ లవియవే? ఆడుదానింజంపుట పాడి గాదు గాన దీని ముక్కుసెవు లాటఁగోసి, వికృతాకృతికి వన్నె పెట్టి, గతితేజస్సత్త్వంబుల హరించెదఁ జూడుము" అని బాణము తూణీరమునుండి కొని ధనుస్సంధానము చేయునంతలో రజోవృష్టి రాఘవులం బొదివె. వెంటనే

శిలావృష్టియుం గురిసె. అందులకు రాముఁడు కోపించి దాని దోర్యుగంబు భూమిం దునిసిపడఁ గత్తిరించె. తోడన రామానుజుండు రాక్షసి కర్ణనాసము లంటఁగోసె. దిక్కులు పిక్కటిల్ల నార్భటించుచు నంతర్హితయై తాటక చీఁకటులేసేయుచు శిలలురువ్వుచు రక్తవృష్టిఁ గురియించుచు గర్జించుచు నట్టహాసముసేయుచు వదనంబు దెఱచికొని మైకుఱుక నుద్యమించె. అదిగని గాధినందనుం డులికిపడి హుంకారంబునఁ దాటకనదల్చి రామునకు 'స్వస్తియగుఁగాక! జయంబగుఁగాక!' యని రక్షకమంత్రంబులు పఠించి "రామచంద్రా! దైతేయులపై నింతదయ యుంచఁదగునే? దితిజహితంబగు సంజప్రవర్తించె. వైళంబ దానిం దెగఁజూచి లోకహితంబొనర్పు" మని పలికినఁ గౌసలేయుండు డెందంబునఁ గల సందియంబువదలి దానిమాయల నశింపఁజేసి యమ్ములనొప్పింప నది పిడుగువడువున నతనిపైఁ బడ నుంకించె. తోడన రాముఁ డొక శరమ్మున నురమ్ము గాఁడ నేసిన నత్తాకున కోర్వలేక తాటక రోఁజుచుఁ బుడమిపయింబడి విగతజీవయయ్యె. త్రిదశులు ముదమంది రాఘవులపైఁ గుసుమవృష్టిం గురిసి యనేకవిధంబులఁ గీర్తించిరి. పరిసరాశ్రమవాసులగు మునులు రాముని సందర్శించి పెక్కురీతుల నతని శ్లాఘించి దీర్ఘాయురస్తని మనసార దీవించి తమతమ నివాసములకుఁ జనిరి.

—:యాగసంరక్షణము:—

దుష్టసంహారణమునకు విఘ్నేశ్వరపూజ నిర్విఘ్నముగ నెఱవేఱెనని విశ్వామిత్రుండు సంతసిల్లి రామ లక్ష్మణుల గాఢంబుగఁ బరిరంభించి యా రాత్రి యచ్చట వసించి మఱునాఁడు వఱువాత మేల్కని ప్రభాతకృత్యంబులందీర్చి ప్రయాణసంసిద్ధులగుడు, దాశరథికి ననేక దివ్యాస్త్రము లొసంగి ప్రయోగోపసంహార రహస్యంబులఁ దెలిపిన నతండు సంతసించి గాధేయు ననుమతమ్మున సౌభ్రాత్రంబు తేటపడ నవరజున కుపదేశించిన నయ్యస్త్రంబులు మూర్తిమంతంబులై రామ లక్ష్మణులకుఁ బొడసూపె. ఆ యస్త్రరూపుల భృశాశ్వకుమారుల రాకుమారులు కరాంబుజంబుల సంస్పృశించి పనిగలయప్పుడు రండని యాజ్ఞాపింప నమ్మూర్తిమదస్త్రమ్ములు రాఘవులకుం బ్రణమిల్లి యంతర్హితములయ్యె. పదపడి వారలచ్చోటువాసి కొంతదూరంబు గడచి యొకచో సుమనోవిరాజితంబై పుణ్యజన సమాకీర్ణంబై మునీంద్ర వాణీవిలాసభాసురంబై స్వర్గలోకంబుడంబున శ్రావ్యంబై మనోరమంబై చైత్రరథంబువిధంబున దివ్యంబై, వియన్మార్గంబుకరణిభవ్యంబై, వైకుంఠంబుకైవడిసేవ్యంబై, సత్యలోకంబుచందంబున మనోహరంబై దూరవసితాపస ప్రవేశసంకులంబై యొప్పు నొక్క మహనీయ తపోవనంబును విలోకించిరి. అవ్వన రామణీయకం బాలోకించి

రాట్కులాభరణంబగు రాముండిట్లనియె. "తాపసోత్తమా! ఇవ్వనంబు మనోనందకరంబైనది. ఇందు నివసించు మృగ వర్గములు స్వజాతివైరంబులు డించి యొకచోఁగలిసి యాడు చున్నవి. ద్విజతతి వేదమంత్రంబు లుచ్చరించుచుండె. ఈ యాశ్రమం బెవ్వనిది? మనయాశ్రమ మెచ్చటనున్నది? యజ్ఞవిఘ్నకారులగు దుష్టదానవు లెందుందురు? ఏమార్గం బునవత్తురు? వారివధించి మఖంబుకడముకడకుండఁగాతుము" అతనిపలుకులకలరి బ్రహ్మర్షిపుంగవుండిట్లనియె. "నాయనా! రామచంద్రా! మున్నిచ్చోట దేవహితార్థియై పుండరీకాయ తాక్షుండు వామనరూపంబున సమోఘతపం బాచరించి సిద్ధుఁడైనకతమున నిది సిద్ధాశ్రమమ్మనాఁబరఁగె. అదితి కశ్యపులు తపోనియతిమైఁ జాల కాలంబుండి వామనుం గుమారునింగాఁ బడసినది నైతమీ స్థలముననే. నాఁడు నీయాశ్రమంబిది. నేఁడును నీయాశ్రమమును నాయాశ్రయ మును నైనది. ఇందే నే వసించి ఘోరతపంబు గావించి బ్రహ్మత్వంబుఁ బడసితి. ఇచ్చటనే మదీయ యాగంబును జరుపఁబడు. విఘ్నకారు లిట కేవత్తురు. వారినిందే వధింప వలయు" నన భాస్కరవంశభాసమానులు వల్లెయని సిద్ధా శ్రమంబు సొచ్చి యంతారాత్రి గడపిరి.

మఱునాఁడు ప్రభాతంబున మేల్కాంచి శుచులై రామ లక్ష్మణులు విశ్వామిత్రునకు నమస్కరించి "నేఁడే

యాగ మారబ్ధమగుఁగాక! మునుపటి సిద్ధాశ్రమం బిప్పు
డును సిద్ధాశ్రమంబయగుఁగాక!" యనిరి. విశ్వామిత్రుండు
ముదితుండై దీక్షవహించి రాకుమారుల హెచ్చరించి హు
తాగ్నిహోత్రుండై వేదికామధ్యంబున వనజాసనుంబోలె
నాసీనుండయ్యె. ధనుఃకాండంబులసజ్యంబు చేసి పిడికిళ్ళఁబట్టి
యమ్ముల నిమ్ముగఁ గరమ్ములఁగొని యమ్మఖవేదిం బరి
వేష్టించి రామలక్ష్మణులు కంటిని ఱెప్పలపోల్కిఁ గాచి
యుండిరి. అయిదుదినంబులు క్రమంబుగఁ గ్రతువు ప్రవర్తిల్లె.
ఆఱవనాఁడు రాఘవులొండొరుల హెచ్చరించుకొని కాచు
చుండఁ దోడ్తోఁ గల్పాంతమేఘధ్వనిభంగి వినువీథిని దారుణ
ధ్వనంబు వినంబడియె. ఆపై భానుండు పాడసూపటాక
సాంద్రరజోజాలమడఁగె. తరువాతఁ జూపఱు తలలెత్తనీక
శిలావృష్టిగురిసె. పిదపఁ గ్రతుశాలపై గహనంబుపై వేదిపై
శోణితంబువర్షించె. అత్తెఱఁగు వీక్షించి భాస్వత్కులుండు
క్రుద్ధుండై "చూచితే లక్ష్మణా! మాయాబలంబున రక్క
సులు సేయు క్రూరకృత్యంబులు! సమీరణంబుచే ఘనం
బులంబోలె మానవాస్త్రంబుచే నీదుష్టుల సముద్ధూతులఁ
జేసెదఁజూడు" మని పలికి వాయవ్యాస్త్రంబున నయ్యసహ్య
వృష్టి మాయించి మార్వెమ్రోయించి మానవాస్త్రంబు
ప్రయోగించె. అది నీచుమారీచు నురమ్ముదాఁకి చంపక
శతయోజనమాత్రంబు దవ్వుల నున్న యుదధిజలంబుల

ద్రోసె. వాఁడెట్లో ప్రాణంబులఁ జిక్కఁబట్టుకొని యీఁదిగట్టెక్కి యరణ్యమార్గంబువట్టె. రాముఁడు తోడ్తోవచ్చి మార్గణమున సుబాహు బాహుదండంబులు శిరంబు ఖండించె. లక్ష్మణుండు తక్కిన బలంబులనెల్ల రూపుమాపె. అప్పుడు రఘుసత్తములు తొల్లి రాక్షసజయంబున దేవగణ పరివేష్టితులైన యింద్రోపేంద్రుల వడువున మునిగణపూజితులై యొప్పిరి. తదనంతరము యాగంబు నిర్విఘ్నంబుగఁ బరిసమాప్తింజెందె. విశ్వామిత్రుండు నిర్భరానందమ్మున నాజితనూజుల గాఢతమంబుగఁ బరిష్వజించి "కుమారులార! మీయురుకరుణను గురుకార్యముఁజెల్లించితి. కృతార్థుండనైతి" నన "మేమును గురుకార్యముం జెల్లించి కృతకృత్యులమైతిమి. ఇఁకఁ జేయఁదగిన కార్యంబుల నానతిం" డని నయమారఁబలుకు రాజన్యకుమారులకు మునిమూర్ధన్యులిట్లనిరి.

—:అహల్యాశాపమోక్షణము:—

"మిథిలాధినాథుండు పరమపూజ్యుండు జనకుండొక జన్నంబు సేయుచున్నాఁడు. అందఱ మాహూతులమై పోనున్నారము. మీకును మాతోడరండు. ఆనృపుని మందిరమునఁ బురమర్దనువిల్లొండతని వంశ్యులచేఁ బూజింపఁబడుచున్నది. అమ్మహనీయ మౌర్వీసంధానమొనర్ప నీవుదక్క నితరులు చాలరు. ఆవిల్లెక్కుపెట్టినవానికి నయోనిజయగు

దనకూఁతు సీత నిత్తునని యతండు ప్రకటించియున్నాఁడు" మునుల వచనముల విని రాకొమరుల హృదయంబు లరసి విశ్వామిత్రుఁడు వారిందోడ్కొని యుత్తరాభిముఖుండై మిథిలానగరమార్గంబుఁ బట్టి చనుచు మధ్యమధ్యఁ గన్పట్టు తపోవన మాహాత్మ్యంబులఁ దెల్పుచుఁ దన వంశక్రమం బును, గంగావతరణంబును, సముద్రమథనప్రకారంబును, నహల్యాశాపకారణమ్మును బ్రసంగించుచు గౌతమవనంబు ప్రవేశించె.

గౌతమశాపకారణమునంజేసి రామసమాగమపర్యం తము మూఁడులోకముల కదృశ్యయైయుండిన యహల్య యప్పుడు రామలక్ష్మణుల కెప్పటిశరీరంబుతోఁ జూపట్టె. ఆమె చరణములకు నారాకుమారప్రవరులు ప్రణమిల్లిన నామెయు గౌతమవాక్యములం దలంచి వారి నాదరించి యర్ఘ్య పాద్యాదికంబు లర్పించి యాతిథ్యం బొసంగి సంస్తు తించె, అంతఁ బ్రతిహతావిద్యాతముఁడు గౌతముఁ డచటి కరుదెంచి రాముని దివ్యగుణంబులఁ గొనియాడి ఘనతపో బలపరిశుద్ధగాత్రియు శ్రీరామపదధూళి క్షాళిత హృదయ శల్యయు నగు నహల్యఁ గూడి తపంబుగావింప నేగె.

—:మిథిలా ప్రవేశము:—

పిమ్మట రామ లక్ష్మణ విశ్వామిత్రు లటనుండి బయలుదేఱి జనకుని యజ్ఞవాటిం జేరిరి. జనకుండును గాధి

వందను రాక విని శతానందుని మున్నిడుకొని ఋత్విజులు కొంద అర్ఘ్యపాద్యమ్ములు గొనిరా నెదుర్కొని యతిథి సత్కృతులు గావించి యుచితాసనాసీనులం జేసి "మహాత్మా! నేఁడుగదా నాయజ్ఞము సఫలీకృతమయ్యె. యజ్ఞసదనంబును బవిత్రీభూతంబయ్యె. మా జన్మములు ధన్యత నొందినవి. నేఁడుగదా నేను రాజన్యులలో మాన్యుండనైతి. బ్రహ్మతుల్యుండవగు నీ రాక దుర్లభము. ఇఁకఁ బండ్రెండు దినముల కీ యజ్ఞము పరిసమాప్తి కాఁగలదు. హవిర్భాగమునకై వచ్చు దేవతల దర్శించి నన్ను ధన్యునిఁ జేయుఁడు" అని పలికి తత్పరిసరంబున ఖడ్గతూణీర ధనుర్ధరుల రమణీయమూర్తుల రాజభానులపగిది రాజిలు రామలక్ష్మణుల నీక్షించి వారి మనోజ్ఞాకారంబుల విలాసవైఖరుల వారక చూచి మెచ్చి "మునిపుంగవా! ఈ సుకుమారులగు రాకుమారు లెవ్వరు? ఏమికార్యార్థ మేతెంచినవారలు? సవిస్తరంబుగ నానతీయవే?" యని యర్థించె.

విశ్వామిత్రుఁడు "రాజవర్యా! వీరలు దశరథకుమారులు. రామలక్ష్మణాభిధానులు. గురుల యాజ్ఞం జేసి నా వెనుక సిద్ధాశ్రమంబున కరుదెంచి యవక్రపరాక్రమంబున,

ఉ. తాటకఁద్రుంచి వైచి యతి
        దర్పితుఁడైన సుబాహు సాయకో

త్పాటితుఁ జేసి గీటడఁచి
ధర్మమెలర్ప నహల్యశాప ము
చ్చాటన మొందఁ జేసి కడు
సమ్మదమారఁగ నీ గృహమ్మునన్
జాటఁగనున్న శంకరుని
చాపముఁ జూడఁగవచ్చి రేర్పడన్"

అనవుడు గౌతమాత్మజుండగు శతానందుం డమందానందంబున రోమాంచకంచుకితాంగుండై కౌశికునింగని "మునినాథా! మా తల్లి మీచే దర్శింపఁబడెనే? అద్దేవి దాశరథుల నతి భక్తిశ్రద్ధలతోఁ బూజించెనే? మజ్జనని శ్రీరామచంద్రునిచేఁ బవిత్రితయై మరల మా జనకుని గూడుకొనియెనే? మా తండ్రి రాముని గని గారవించెనే?" యని యభ్యర్థించి యన్నియు నీ కోరినట్లయయ్యె నను నుత్తరంబు విని రాముని గాంచి "తాటకాది విదారణంబునం దగపఱచిన యుష్మద్బాహుబలంబును దుష్టశిక్షణ శిష్టకార్యరక్షణంబును మజ్జనని శాపనిర్ముక్తం జేసిన భవత్పాదకమలరజంబును బొగడ నా బోటికిఁ దరమే? నీకంటె ఘనుఁడు ధన్యుఁ డీ ముల్లోకంబులఁ గానరాఁడు. కనకగర్భప్రతిముఁడగు కౌశికు రక్షణంబున నీకుఁ గొఱఁత యెద్దియు లేదు. ఇతఁ డసామాన్యుఁడు. అతర్క్యకర్ముఁడు. అవిద్యావిచ్ఛేదకుఁడు. ఇతని దివ్యతర ప్రభావంబులఁ బ్రస్తుతింప

నస్మాదృశుల కలవియే?" యని యతని రాజప్రభృతి బ్రహ్మర్షి పర్యంత వృత్తాంతంబు సాంతంబుగ వినిపింప రాఘవు లా విశ్వామిత్రు నాననం బుపలక్షించి చిఱునగవు మొగమునఁ జెంగలింపఁ "దాతా! మేము పుట్టినదాదిగ నెన్నో సత్కథలు వింటిమి. నీ చరిత్రకువలె నీ శ్రుతు లింత యానందింపలేదు. మా జన్మంబులు సాఫల్యంబు నొందె" నని ముచ్చటపడిరి.

—:శివధనుర్భంగము:—

ఆ మఱునాఁ డందఱు నిత్యకృత్యంబులఁ దీర్చికొని దివ్యపీఠికల నలంకరించిరి. పిదప విశ్వామిత్రుండు విదేహ రాజుం గని "రాజోత్తమా! వీరాగ్రేసరులు రాజకేసరులు హరశరాసనంబుఁగనఁ గౌతూహలాయత్తచిత్తులై" రన జనకుండు విస్మయమంది యిట్లనియె.

"మహాత్మా! మద్వంశకర్త యగు నిమికి నాఱవ తరమువాఁడగు దేవరాతునకు దేవతలీ చాపంబు నిచ్చిరి. దక్షాధ్వర వినాశంబు సేయంగోరి శివుఁడు ధనుస్సంధానము సేయ దేవతలతనిం బ్రార్థించి కోప ముడిగించిన శంకరుండా వింటిని దివౌకసుల కొసంగియుండె. నాఁడు మొదలుగ నా ధనువు మా యింటఁ దరతరంబులవారిచేఁ బూజఁ గొనుచున్నది. ఏను మున్నొకప్పుడు యాగము చేయఁగోరి చదును చేయఁ బుడమి దున్నింపఁ నాఁగటిచాలున నొక

మందసం బగపడియె. తన్మూద్రాభంగ మొనరింప జల దంబు విడిచి జగతికి దిగిన క్రొక్కారు మెఱుంగు తెఱంగున నొక్క కన్నియయందుఁ దోఁచె. దానిం గైకొని చాలునఁ జిక్కిన కతన సీత యని పేరిడి యల్లారు ముద్దుగఁ బెనిచితి. క్రమాభివృద్ధి నామె యౌవనావిర్భూతయై యయోనిజ గావున వీర్యశుల్కనాఁ బరఁగె. ఆ కన్య యనన్యసామాన్య ధన్యయగుటంజేసి వసుంధరా రమణ పురందర నందను లెందఱేని చనుదెంచి తమ తను బిరుదాంకంబులు వక్కా ణించి సీతనిమ్మనియడుగ వారల 'కీ కన్య వీర్యశుల్క గావున మన్నిశాంతమునఁ బర్వతభంగిం జెలంగు ననంగభంగు భవ్యశరాసనం బెక్కిడు వారి కిత్తు' నని పల్క వల్లె యని వారు తమ కొలంది తెఱుంగక యెండ్రొరుల మీఱి బహువిధంబులఁ బోరి యవ్విల్లు నిట్టట్టు గదల్పఁజాలక బెండువడి సిగ్గునఁ దలయెత్తలేక నిరాశులై చని యంద ఱొకగుమియై 'తరుణి నిచ్చెదనని కోదండ మొకటి నెప ముగ నిడి మనల నవమానించిన యతనిఁ గయ్యంబున గెలిచి యయ్యువిదం గొనివత్త' మని కడంగి యుద్ధసన్న ద్ధులై మాపురి ముట్టడించి యొక వత్సరకాలంబు రణంబు చేసిరి. తుది దేవదత్తబలసమేతుఁడనై వారల నెల్లరఁ దఱిమితి. ఆ విల్లు నీ రఘూత్తముఁ డెక్కిడెనేని నా వర పుత్రికం దప్పక యిత్తు" నని శివచాపముం గొని తేర

మంత్రుల నియోగించె. వారు నిరంతర గంధమాలికార్చిత
మగుదాని

సీ. కమనీయ సుమనః ప్ర । కాండ సంకీర్ణమై
    కనకాచలముభంగిఁ । గ్రాలుదాని
నగరాజనందినీ । నాథాంకయుక్తమై
    యలరజతాద్రి య । ట్లలరుదానిఁ
జటులవేగోద్ధూత । చక్రసందీప్తమై
    యుదయాచలముభంగి । నొప్పుదాని
నసదృశ శ్రీగంధ । రసఘుమంఘుమితమై
    గంధమాదనమట్ల । గ్రాలుదాని
తే. గీ. ననుపమాయస నిర్మిత । మైనదాని
    మహితగతినొప్పుదాని నా । మందసమును
    గాంచి కడుదీర్ఘదేహులై । క్రాలు నమిత
    బలులఁ బంచసహస్ర వీ । రులను బంచి.

వారిచే నమిత ప్రయత్నంబున నెత్తించుకొనివచ్చి యచ్చట నుంచిరి. జనక విశ్వామిత్రుల యనుమతంబున నమ్మనువంశ వల్లభుండు మంజూషా ముద్రాదళనం బొనరించి తన్మధ్యభాగనిక్షిప్తమైన మహాకార్ముకంబు నవలోకించి డాపలికేల నవలీలఁ గైకొని గొనయమ్మెక్కించి రాకొమరులెల్ల మహాసాహసంబని తన్నీక్షింపఁ గౌశికుండు నిర్భర ప్రమోదుండుగా బాహుబలంబు వెలయ నాకర్ణ

పూర్ణంబుగాఁ దిగిచి విడిచినఁ దచ్ఛరాసనంబు ఫగిలి ఫేలెత్తి జగములు పల్లటిల్ల పభ్యులు తల్లడిల్ల వార్ధులు ఘూర్ణిల్లు చందంబున భీషణ నినదంబున ఫెళ్ళునఁ బెరుకు-శకలంబులై తునిఁగి పుడమిం బడియె.

సీ. నిటలాక్షు ధనువుఁ ద్రుం । చుటకుఁ గౌశికుఁడెట్టు
లనుమతించెనటంచు । నమరులనఁగఁ
జెలికానిధర్మంబుఁ । జెఱుపఁ గాకుత్థ్సుఁ డే
గతిఁ బూనెనని శైవ । గణము నొడువఁ
గడిఁది విల్లునియు చ । ప్పుడు వీనులకువిందు
సేయు నెప్పుడటంచు । సీతదలఁప
నితఁడల్లుఁడైన శ్రీ । పతి మామ యగు రమా
జనకుఁబోలనెయంచు । జనకుఁ డెంచ
తే. గీ. హారధనుర్భంగ కార్య మె । వ్వారికిఁ దెలిపి
సూడు పుట్టింతునని నిల్చు । చో నిలువక
కలహభోజనమౌని న । ల్గడలఁ దిరుగ
శివునివిలు ద్రుంచె రఘువీర । శేఖరుండు.

ఆ శబ్దంబునకు జనక లక్ష్మణ విశ్వామిత్రులుదక్కఁ దక్కినవారు కొంతవడి మూర్ఛను మునింగి తేఱి చాల ముదంబందిరి. జనకుం డత్యంత సమ్మదోత్కర్షంబునఁ జిత్త మిగురొత్త నత్తపసిసత్తమునిం జూచి "రాముండు దృష్ట వీర్యుండయ్యె. ఇతని దోర్యుగస్థితివీర్య మచింత్యము. అగ

ణ్యము. అమితము. అమోఘము. అత్యద్భుతము. ఇతని భర్తగాఁబడసిన సీత జనకకులమున కెంతయు యశమాపాదింపఁగలదు. వీర్యశుల్క సీత యని నాచేసిన ప్రతిజ్ఞ నీదయావలోకనము సంజేసి సత్యమై ఫలవంతమై పరఁగె. నేఁడు ప్రాణబహుమతయగుసీతను రామునకు భవాదృశుల యెదుటనిచ్చితి. శీఘ్రగతులైన యమాత్యుల నయోధ్యకుఁ బనిచి కుమారుల భద్రంబును భర్గధనుర్దళనంబును సీతారామ వివాహనిశ్చితంబును దెలిపి దశరథాదులఁ బెండిలికై పిలిపింతు" అని కౌశికు నంగీకారంబంది యొక్క కాంచన పట్టిక యందు యథాక్రమంబున శుభవాచకాక్షరంబులు లిఖించి కుంకుమాంబలంది మంత్రులచేతి కొసంగి "మీరతి త్వరితగతినేగి దశరథు సందర్శించి యిచ్చటి శుభప్రసంగ బంతయుం బ్రకటించి బంధుకుటుంబ పరివారసమేతంబుగ సీతారామ వివాహంబున కిమ్మహీపతిం దోడ్కొని రం" డని పనిచె.

వారు మరుజ్జవంబులగు వారువంబుల నధిరోహించి మూఁడవనాఁడయోధ్యం బ్రవేశించి ప్రభునిదర్శించి యచ్చటి యుదంతం బాద్యంతము మధురాక్షరయుతంబుగ వ్యక్తంబు చేసి "పురోహితోపాధ్యాయ బంధుమిత్రామాత్య సహితుండవై చనుదెంచి కుమారకల్యాణోత్సవ సమాలోకన సంజాత పరమానందం బనుభవింపు" మని విన్నవించిన

వారల భూరమణులను సత్కరించి సభ్యులఁ గలయంజూచి వసిష్ఠ వామదేవాదుల మంత్రిసత్తముల విలోకించి "వింటిరే రాముని యద్భుతకృత్యంబులు! మహాత్ముఁడగు విదేహుని సంబంధంబు మీ కభిమతం బయ్యెనేని కాలయాపనము చేయక యరుగుద" మనిన నంద అందుల కామోదించిరి.

మఱునాఁ డుదయంబునఁ బయనంబని యెల్లర కెఱిఁగించి దశరథుఁ డా రాత్రి రామ ప్రభావంబు రామాయణ లతోఁ బ్రసంగించి వేఁకువను మేలుకని కాల్యకరణీయం బులం దీర్చి యుపాధ్యాయ బాంధవ పరివృతుండై యుచిత గతిం బయనించి నాలుగుదినంబులకు మిథిలాపురిం జేరె. జనకుండు బహువిధ మంగళవాద్యములతో నాజి కెదురేగి హితమర్యాద లొనరించి "జనవరా! వీర్యసముపార్జిత నంద నుం బడసి నీవును నీ వలన నేనును జరితార్థులమైతి" మని యిత్యాది మృదుమధురోక్తి సపర్యలు నెఱపి పుర ప్రవే శంబు సేయించి తగిన విడుదు లమర్చిన దశరథుండు నిజ నందనులఁ గని హర్షమలర సుఖలీలల నానాఁడు గడపె.

జనకుండు నవశిష్ట యాగకర్మంబు నిర్వర్తించి యా రాత్రి వివాహాంగభూతంబైన యంకురార్పణాదికంబు గా వించి యథాసుఖంబుగ శయనించి ప్రభాతంబునఁ బ్రబు ద్ధుండై నిత్యంబు నిర్వర్తించి నైమిత్తికంబగు వివాహసన్నా హంబున నుండె. శతానందుని వలన సీతా వృత్తాంతంబు

దెలిసి పుత్త్రికాద్వయయుతుండై కుశధ్వజుండు వచ్చి యన్నం గలిసికొనియెను. తదుపరి జనకునకు వసిష్ఠుండు దశరథాన్వయ ప్రకారం బెఱింగించె. జనకుండు తనవంశక్రమంబు వారికిఁ దెలియఁబఱచి "సీతను రామునకు రెండవకూఁతు నూర్మిళను లక్ష్మణునకుఁ ద్రిశుద్ధిగా నిచ్చెద. రామ లక్ష్మణుల యభ్యుదయార్థమై గోదానపూర్వకంబుగ నాందీముఖంబును సమావర్తనంబును జేయింపుఁడు. ఎల్లుండి యుత్తరఫల్గునీ నక్షత్రంబు శుభగ్రహసహితమై యుద్వాహంబునకుఁ దగి యున్నది" అనిన వసిష్ఠ విశ్వామిత్రు లంతకుఁ గొంత మున్నుగఁ గుశధ్వజు కొమరితలఁజూచి వీరు భరతశత్రుఘ్నులకుఁ దగినవారని నిశ్చయించి యవ్వార్త జనక కుశధ్వజులకుఁదెలిపి "దాశరథుల నల్వుర నల్లుండ్రఁగాఁ బడయుఁడు. రాఘవులతోడి వియ్యంబు మీ కెంతయుఁ దగి యున్నది" అనిరి.

అది విని వైదేహుండు కృతాంజలియై "మద్భాగ్య విశేషంబునంజేసి రాఘవులతోడి బాంధవ్యంబు సమకూఱె. చాల ధన్యుఁడ. నల్వుర కొక శుభలగ్నంబునఁ గార్యంబు జరపుఁడు. దశరథునకు మత్పురంబయోధ్యయట్ల వలయు. ఆయనపై మీకుఁగలసత్కృప నాపైఁజేర్చి యేయేకార్యంబు లెట్లెట్లు జరుపవలయు నట్లట్ల సర్వము నిర్వహింపుఁడు" అనిన నతనిపలుకుల కెల్లరలరి వారివారి విడుదులకుఁజనిరి.

మఱుచటినాఁడు విద్యుక్త ప్రకారంబునఁ బిత్రుదేవతల నర్చించి కలధౌతాంచితఖురవిషాణంబులును దామ్రపుచ్ఛంబులును గాంస్యదోహనంబులును సవత్సలునైన పాడి మొదవులఁ బాఱులకు దానంబుసేసి రత్నసువర్ణవసనధనంబు లనంతంబుగ బీదలకొసంగి సనాదనుఁడైన దశరథుండు లోకపాల పరివృతుండైన ప్రజాపతియుంబోలె వెలుంగుచుండె. అట్టియెడ భరతుమాతులుండు యుధాజితుండు తండ్రి పంపున దౌహిత్రుందోడ్కొనిపోవ నయోధ్యకే తెంచి యట రాఘవుల కల్యాణగాధ విని మిథిలకుఁ జనుదెంచి పంక్తిరథుని దర్శించి కుశలప్రశ్నంబులు గావించి యతనిచే సత్కృతుండై యుప్పె.

—:వివాహము:—

ఆమఱునాఁ డరుణోదయమున దశరథుఁడు పుత్ర సహితుఁడై విద్యుక్తకర్మము లాచరించి వసిష్ఠాదిమునులఁ బురస్కరించుకొని నానావిధ మణిభూషణ వస్త్రమాల్యానులేపనంబుల నలంకృతులైన సుతులం గూడి మంగళ రావములతో నెదురైన జనకునిఁ గలిసికొని యుత్సవశాలఁ జేరె. అంత వశిష్ఠుండు విశ్వామిత్ర శతానందుల మున్నిడుకొని వహ్ని ప్రతిష్ఠాపనంబు చేసి మంగళహోమంబు లాచరించె. పిమ్మట జనకుం డలంకారసమేతయైన సీతను దోడ్కొంచి రాముని కభిముఖంబుగనిలిపి “శ్రీరామచంద్రా!

ఈసీత నాతనూజాత, నీకు సహధర్మచారిణియై సంతతము ఛాయగతి ననుగతయై యుండు. ఈ కన్య కరంబుఁ గరంబునఁ గరంబు ప్రీతిమెయిఁ బరిగ్రహింపుము. నీకు శుభంబగుత" మని పాణిగ్రహణంబు సేయించి శుభమంత్రపూత జలంబును శ్రీరాముని కరజలజమున ధారవోసెను. తరువాత లక్ష్మణునకు నూర్మిళను గన్యాదానంబుసేసె. కుశధ్వజుండు మాండవీ శ్రుతకీర్తుల భరత శత్రుఘ్నుల కానుపూర్వగ నొసంగె. పిమ్మట వధూవరుల నడుమఁ గల తెరదీయ నూత్నవధూవరులు పరస్పరావలోకనంబుల నానందించిరి. పుండరీకాక్షుండగు రాముండు సీత నెమ్మోముఁ గాంచి కంఠంబుగని క్రమంబునఁ గటినిటు నవలోకించి పదంబుల పొందిక నీక్షించి యామె లావణ్యసరసి నలరు వికచాబ్జములోయన నొప్పు నతని నయనదృష్టుల సార్థకంబు గావించికొనె. భూవరు లుత్తరోత్తర పదస్పృహులకదా! రాముని సౌందర్యవారిధి కెదురెక్కు మీలోయన సీత వాలుచూపులు పతిమీఁద వ్రాలె. అంత వివిధ మంగళ రవంబులు మెండుకొనఁగ శాస్త్రోక్తక్రమంబున నయ్యంగనల యందు గుమారపుంగవులు మంగళసూత్రములు గట్టిరి. కడమపడిన కార్యంబులు విధ్యుక్తప్రకారంబుగ నెఱవేఱె. మహర్షు లాశీర్వదించిరి. సభాసదులు హర్షించిరి. వందిమాగధులు జయశబ్దంబులు చేసిరి. మింటవేల్పులు పూల

వానఁ గురిసిరి. గంధర్వులు పాడిరి. రంభాదు లాడిరి. అమ్మహోత్సవంబు పరమాద్భుతదర్శనంబై మెచ్చుటఁగనుఁ గొన్నను గస్తూరి కాగరు కర్దమంబును జనసమ్మర్దంబును వివిధాన్నదానంబులు దత్తదక్షిణానూనంబులునై యొప్పె. పది దినంబు లిట్లు మహోత్సవంబు ప్రవర్తిల్ల,

క. అన్నిదినంబుల శుభములు
కన్నులు తనియంగఁ జూచి కౌశికుఁడు సుధీ
సన్నుతు దశరథుజనకుని
నన్నుతిదీవించి చనియె నుత్తరగిరికిన్.

—:పరశురామ గర్వభంగము:—

విశ్వామిత్రుండు వెడలినపిదపఁ గొడుకులతో గోడం డ్రతో దశరథుండు ప్రయాణోన్ముఖుండయ్యె. జనకుండు కొమి రెల కవరిగ సారెలిచ్చి సద్బుద్ధులు గఱపి రత్నాందోళికల నెక్కించి సాగనంపె. అట్లందఱుఁ గొంతదూర మరుగ దుశ్శకునంబులు పెక్కులు తోఁచెను. అందులకు మదిం గలంగి పంక్తిరథుండు వసిష్ఠుం గని "గురువరేణ్యా! ఇదేమి విపరీతము! ఖగము లుగ్రభంగిఁ గూసెడిని. మృగములు వలపటఁదిరిగెడిని. కరులు హరులు కలంగి యొండొంటిం గానక పాఱెడి. రథికులు స్యందనంబులు డిగ్గి పరిభ్రమించి పాఱుచున్నారు. భానుని కాంతిమాసె. పట్టపగటఁ దార కలు రాలె. ఇట్టి మహోత్పాతంబులకుఁ గతం బేమై

యుండు" నన వసిష్ఠుండు కొంతవడి నాలోచించి "ముందేదో గొప్ప యాపద రానున్నది. కాని వెనువెంట మితిలేని విజయము చేకూరఁగలదు. ఓడకు" మనియె.

అంత శరీరంబున స్వేదజలంబులొలయఁ గరంబున బరశువుగ్రాలఁ గన్నులనిప్పులురలఁ గెంజాయ విడుద జడలు వ్రేల వికటభ్రూకుటిభీమఫాలుఁడై విశేష భీషణుఁడై రాజకుల విరాముండగు భృగురాముఁ డేగుదెంచె. రామలక్ష్మణులు వసిష్ఠాదులు తప్ప నందఱు భయభ్రాంత చిత్తులై భయనివారకమంత్రంబులు తడఁబడ నుచ్చరించుచు నతని కెదురునడచి తెలిచి తొలఁగినిలిచిరి. పరశురాముఁడంతటఁ గడచి "యేడీరాముఁ" డని శ్రీరాముని యెదుటికి వచ్చి నిలిచి మేఘగంభీర భాషణంబుల నిట్లనియె.

ఉ. "రాజఁట! యంతమీఁద మఱి
రాముఁడు తానఁట! యీకురాజులన్
రాజిలఁద్రుంచి తత్ప్రసృత
రక్తములన్ బితృతర్పణక్రియల్
రాజిలఁజేసియున్న భృగు
రాముఁడు తుచ్ఛ మదాంధులైన యీ
రాజులగీజులన్ వెడఁగు
రాములగీములఁ జూచి సైఁచునే?

రామా! నీవు మహాబలశాలివఁట! మద్గురు శరాసనంబును విఱిచిన పోటుబంటువఁట! కాన నిన్నొకచేంతు చూడ

వచ్చితి. చివుకువిల్లేమిలెక్క? ఇదిగో! నాచేతనున్న వైష్ణవ ధనువు నెక్కు-వెట్టుము చూతము! దీనిని సజ్యంబు చేసితి వేని మెచ్చి ద్వంద్వయుద్ధంబు ప్రసాదించెద"

ఆవచనంబులు విని దశరథుఁ డదరిపడి దైన్యముతో "మునిపుంగవా! భూభృజ్జనంబులఁ ద్రుంచి త్రుంచి శాంతుండవై తపమాచరించు నీకీబాలునిపైఁ గోపమేలజనించె? జనకుండు పణంబుగానిడిన శివధనువును ద్రుంచుట తప్పే? వాసవాదులు నినుఁ బ్రార్థింప నస్త్రసన్న్యాసమొనరించి కశ్యపునకు సమస్తధరిత్రి నొసంగి మహేంద్రాద్రికేగిన యుదారచిత్తుఁడవు. నీకోపాగ్నికి రాముడెంత? కరుణింపవే?" యని ప్రార్థించిన నప్పలుకుల ననాదరంబుసేసి "నినుఁ బురుషులలోఁ బరిగణింపక యుపేక్షించినందుల కింత లయ్యె" నని రామునివంకఁ దిరుగ, శ్రీరాముండు తండ్రి యనుజ్ఞగొని భార్గవున కిట్లనియె.

"బ్రాహ్మణోత్తమా! నీయుదంతంబంతయు మున్నె యెఱుంగుదు. రాజులకు విప్రులు పూజార్హులుగాని దండార్హులుగారు. మఱియు మద్గురుండగు విశ్వామిత్రు బంధుండవు. తండ్రి ఋణంబుదీర్ప భూమి నక్షత్రంబుసేయుట నీకొప్పునని సహించితి. క్షత్రధర్మంబునందు నన్నశక్తునిగఁ దలంచితివి గావున సైఁపఁజాల. తొలఁగుము" అన జామదగ్న్యుండు శిరంబుపంకించి "బళా! ఎంతమాట! నన్నలఁ

తిగఁ దలంచితివి! రాజకులనాశంకరుండ. శంకరకింకరుండ. మున్ను సమస్తదేవముఖ్యుల ప్రార్థనచే విశ్వకర్మ తన సామర్థ్యంబు మెఱయఁ జాపయుగ్మంబు మేరుసారంబుగఁ గులిశకాఠిన్యంబుగ సృజియించె. అందొకదాని శూలి కొసంగఁ దానద్దానఁ ద్రిపురంబులఁ గూల్చె. రెండవదాని విష్ణువున కొసంగి హరిహర తారతమ్యంబరయఁగోరి యిరువురకు వైషమ్యంబు గల్పింప జాతరోషులై పరస్పరజయకాంక్షులం దలపడి భీమసంగ్రామంబు గావించిరి. పదపడి హరి హుంకారంబున శంకరుండు ధనువుతోడ స్తంభితుఁడయ్యె. పంకజభవాదుల ప్రార్థనచేఁ బద్మనాభుండు బవరంబు చాలించె. జగంబులు సంతసించె. హరి హుంకారనిస్సారశంభుశరాసనంబు జనకునింటఁజేరె. వైష్ణవధనువును విష్ణుండు ఋచీకున కిచ్చె. అతఁడు మాతండ్రి కొసంగ నది నాకు లభించె. అదియే యిది. కైకొను” మన నతని బాణబాణాసనంబులతోఁ దేజముసైత మాకర్షించి కనుల కెంపుసొంపెసఁగ రాముఁడు పరశురాముంజూచుచు ననాయాసంబున నెక్కిడి “జామదగ్న్య! విప్రుండవని గురుబంధువని నీజీవంబులఁ గొననైతి. కాని మత్కరశర సంధానంబమోఘంబు గాన భవదీయపాదగమనశక్తిని ఖండించెద. కాదంటివేని తపోబలసముపార్జితపుణ్యలోకప్రాపణశక్తిని హరించెద. రెంటనీకభిమతంబెయ్యది?” యన నతఁడు తెల్లఁబోయి రాముని రూపలక్ష

ణంబు ఉపలక్షించి దర్పబలోత్సాహంబుల వదలి ధైర్యంబు విడిచి చేష్టలుడిగి నిర్వీర్యుండై ఆచ్చవడి కొంతవడికిఁ దల యెత్తి గద్గదికంబుగు మందంబునైన స్వరంబున నిట్లనియె.

“భూమియెల్లఁ గశ్యపున కిచ్చి నిలువనీడ లేక పవ లెల్లఁ వసుధం గ్రుమ్మరి రేల మహేంద్రాద్రి కేగుచు నిట్లు కాలమొకరీతిగాఁ గడపుచుందుఁ గావున మద్గతినేయకుము. నాపాలి పుణ్యలోకంబుల నేయు” మన రాముఁ డట్ల కావించె. పిదప భృగురాముండు ‘రామచంద్రా! రాజ మనోభిరాముండవు నీవు. రాజవిరాముండను నేను. ఇరువు రము జగద్గురునంశమూర్తులము. నీచే నోడుట నాకు గొఱంతగాదు. దీర్ఘాయుష్మంతుండవై శిష్టపాలనంబు దుష్ట విఘాలనంబు ధర్మసంస్థాపనంబు గావించి కీర్తిమంతుండవై నావలెఁ గాక సంపూర్ణమానవత్వమ్మునొంది మానవానీక మ్మున కాదర్శపురుషుండవు గ”మ్మని దీవించి ప్రదక్షిణించి యాత్మసమస్కారంబు గావించి వీడుకోలువడసి మహేంద్ర గిరి కేగె. అపుడు సుఖవాయువులు వీచె. దిశలు ప్రస న్నంబులయ్యె. రాముఁడు జామదగ్న్యచాపంబు వరుణున కొసంగి వసిష్ఠదశరథుల సన్నిధి కరుదెంచి పరశురాముండు పోయెనని తండ్రికిఁ దెల్పి యతనిచే నాలింగితుఁ డయ్యె. దశ రథుఁడు రాముని బునర్జాతునిగాఁ దలంచుచు బంధుమిత్రా దులతోఁ గదలి మంగళవాద్యపురస్సరంబుగ సుముహూర్తం

బున నయోధ్యం బ్రవేశించె. నూత్నదంపతులఁ గని తల్లులు ముదమందిరి. రాకుమారు లిష్టోపభోగంబులననుభవించుచుఁ గొంతకాలంబు సుఖంబుండిరి.

క. కొడుకులుఁ గోడండ్రును దన
పడఁతులు ముదమంద సేన పతులును సచివుల్
దడములుగొల్వఁగ ధర్మా
బడరఁగ దశరథుఁడు రాజ్యపాలన మొనరించెన్.

—:పట్టాభిషేక ప్రయత్నము:—

ఒకనాఁడు దశరథుఁడు భరతునిఁ జేరఁబిలిచి "కుమారా! శత్రుఘ్న సహితుండవై కేకయదేశమునకేగి నినుఁ జూచు వేడుక యెడఁదఁ గడలుకొన నెదురు చూచు నీ మాతామహుని ప్రియంబుదీర్చి యటఁ గొంతకాలముండి రమ్ము" అని యుధాజిత్తునితోఁ బంపె.

మఱికొన్నాళ్ళు చన్నపిదప నొకనాఁడు పంక్తిరథుండు నిండుపేరోలగంబుండి సామంతుల మంత్రులఁ బురోహితులఁ బౌరుల బంధువర్గంబుల విలోకించి "మత్సమాజ్ఞ నంబులార! ఇంతకాలంబు రాజ్యంబు నొక తీరుగఁ బాలించితి. వృద్ధుడనైతి. దేహసత్త్వంబు సన్నగిల్లె.

శా. ధీరోదాత్తుఁడు నిర్వికారుఁడు జగ
ద్వీరుండు సౌజన్య వి

స్తారుం డుత్తమశీలుఁ డర్కకులని
స్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచార సారుఁడగుటం
బెంపార విశ్వంభరా
భారంబెల్ల భరింప రాఘవు మహా
భాగు న్నియోగించెదర్"

అనిన సభ్యులెల్ల నైకకంఠ్యముగ "భవదభిమతంబు శీఘ్రంబున జరపుఁడు. విపుల కాంతిమంతుండై పట్టభద్రుండై దయాసముద్రుండగు రామభద్రుండు శత్రుంజయ భద్రగజారూఢుండై యాతపత్రావృతాస్యుండైరా నిక్కచూడ మా మనంబులు తత్తఱపడుచున్నవి" అనిరి. ఆ పలుకులు రాజు విని రాము నభిషేకంబు సర్వజన సమ్మతంబని యెఱింగియు నెఱుంగనివాఁడపోలె స్వాభిప్రాయంబు మాటుపఱచి ప్రజాముఖంబున నెఱుంగువాఁడై సదస్యులంగని "మద్వచన శ్రవణానంతర మొక త్రుటియైన విచారింపక రామాభిషేకంబునకు వేగిరపడితిరి. దీన నాకు సంశయంబు వొడమె. మత్పరిపాలనంబునఁ బొసఁగిన దోసఁగుల మన్నింపుఁడు" అన వా రమ్మహీకాంతునితో "దేవా! మేము నీచే మిక్కిలియుఁ బరిపాలితులమైతిమి. నీ యందు దోషగంధం బించుకయు లేదు. ఐన రాముని కల్యాణగుణ బాహుళ్యంబుల వలన వశీకృతులమై యిట్లంటిమి. పర

పురుష దుర్లభంబులగు సుగుణంబు లనేకంబు లతనియందు సన్నివిష్టంబులై యుండు. పరుల మేలోర్చు. దుఃఖంబు లోర్వఁడు. తారతమ్యబుద్ధి లేదు. గురుజనంబులఁ బ్రేమం గారవించు. అతని కోపప్రసాదంబు లమోఘంబులు. సత్యమూర్తి. ధర్మానువర్తి. ఇట్టి యభిరామమూర్తికి నభిషేకం బనిన నేల సంతసంబు గలుగకుండు? పురంబున నాబాల గోపాలము సమాహిత చిత్తంబున రామాభ్యుదయార్థము సర్వదేవతలఁ గాలత్రయంబు నమస్కరించుచుండు. మా యభీష్టంబు భవత్ప్రసాదంబున సఫలీకృతంబగుఁగాక" యని విన్నవించిరి.

దశరథుం డయ్యైకార్యంబులఁ దగినవారి నియమించి సుమంత్రునిచే రాముని రావించి కాంచనమణి విభూషి తరుచిర పీఠంబున సుఖోపవిష్టుం జేసి "రామా! ధారణీప్రజ లెల్ల నీచే రమింపఁబడుటం జేసి నిజముగ రాముఁడవైతివి. స్వభావజనిత విమలగుణఖనివైన నీకు వేఱ చెప్ప నేల? తండ్రి ననుభ్రాంతిచే నొక హితము చెప్పెద. వినయ వంతుడవై యంగనాదిక కామజవ్యసన దూరుండవై జితేం ద్రియుండవై వాక్పారుష్యాది వ్యసనంబుల విసర్జింపుము. ప్రత్యక్షవృత్తిని బ్రధానుల రంజింపుము. పరోక్షమున సర్వజనంబుల రంజింపుము. ప్రజలకు రాజు ప్రాణంబు. రాజునకుఁ బ్రజ శరీరంబు. నీకు యౌవరాజ్యాభిషేకంబు సేయ సమకట్టితి.

మ. వినుమెల్లుండి దినంబు లెస్స నిఖిలో
ర్వీచక్ర రక్షాభరం
బున కీ వెల్లి ధరాసుతాసహితుఁడై
పుణ్యోపవాసంబు గై
కొని సేమంబున నుండు పొ మ్మనుచు వీ
డ్కొల్పెన్ గుణాలంకరి
ష్ణుని భూయిష్ఠవరిష్ఠ నిష్ఠురరణా
నుష్ఠాన సిష్ఠాపరున్।

పౌరు లెల్లుండి రామాభిషేకంబని విని ప్రముదంబున నిజవేశ్మంబు లలంకరించుకొనుచుండిరి. తండ్రిచే ననుజ్ఞాతుఁడై రాముఁ డవ్వర్త నిజజనని కెఱిఁగించు తలంపున నటకుఁజని పూజాధామంబున దామోదరు ధ్యానించుచు నియతినున్న తల్లింగని ప్రణమిల్లి వాక్యకోవిదుండగుటఁ జతురతమెఱయు "జననీ! రాజ్యపాలక కార్యంబునఁ దండ్రిచే నేఁడ నియుక్తుండనైతి. ఎల్లి పుష్యయోగమున నన్నీన రాజ్యపట్టబద్ధుఁ జేసెదనని యీ రాతిరి సీతాసమేతంబుగ నుపవసింపుమని తండ్రి నియోగించె. కావున నెల్లియేయే మంగళకర్మంబు లాచరింపవలయు నవియెల్ల మాచేఁ జేయింపు" మనవుడుఁ జిరకాలాభికాంక్షితంబైన తత్ప్రియవృత్తాంతంబు విని రామజనని యానందబాష్పధారాపూరితలోచనయై "రామా! చిరంజీవి వగుము. నీ రిపులెల్ల

హాతులైరి. సుశ్రీయుతుఁడవై సుమిత్ర బంధువుల నానంద పరులఁజేసి ప్రోవు" మని కొమరుని శిరంబుపైఁ గరంబిడి పలికె. పిమ్మట రాముఁడు తమ్మునిం గాంచి "లక్ష్మణా! నా యంతరాత్మవైన నిన్న రఘువంశ రాజ్యలక్ష్మి యధిగ మించె. ననుఁ గూడి సంతత సంతోషస్వాంతుండవు గ" మ్మని యర్థగంభీరంబుగఁ బల్కి లక్ష్మణుమనంబు గలిపికొని సీతం గలిసి వసిష్ఠానుమతమ్మున ధృతవ్రతుండయ్యె.

—:మంథర దుర్బోధ:—

తదనంతరము కైకేయీ జ్ఞాతి దాసియు నవిజ్ఞాత దేశమాతాపితృకయు నైన మంథర యను నొక కుబ్జ యా నాఁడు కైక నివాసప్రాసాదం బారోహించి పురాలంకా రంబు గలయంగాంచి విస్మయావిష్టచిత్తయై తత్తఱమునఁ దన్మహోత్సవ శ్రవణజనిత పరమానంద రోమాంచకంచుకిత గాత్రియగు నొకధాత్రి నాలోకించి కారణంబడిగి తెలిసి కొని ప్రశోకపీడితస్వాంతయై తొల్లి రామునిచేఁ దనకైన చరణతాడన భంగంబు నెపంబుగా వైరంబుగొని "యెట్టు లైన రామాభిషేకభంగంబు గావించి కృతార్థనగుదుఁ గాక" యని నిశ్చయించి వే హర్మ్యంబు దిగ్గి కైకేయి నవ లోకించి యిట్లనియె.

"ఏమమ్మా! కైకా! వచ్చిన ముప్పు నెఱుంగక నిదురించెదవే? ఇంత మాంద్యమే? సౌభాగ్యవతినని విఱ్ఱ

పీఁగు నీ గర్వము వేసఁవినాటి ప్రవాహమువలె నేఁటితో నంతరించె.

క. పతి కౌసల్యకు వశుఁడై
యతివా! త్వన్నాశ హేతు కైక గు వైదేహీ
పతిని యువరాజ్యమునకుం
బతిఁజేయఁ దలంచె నీదు కబ్రదు కేటికిఁకన్"

రామాభిషేకవార్తా శ్రవణసంజాత పరమానంద రసపూరితహృదయయై కేకయరాజపుత్త్రి సరసమణిప్రభా పటలశోభితంబైన యొక్క దివ్యాభరణం బొసంగి "చెలీ! రామాభిషేక సంతోషవార్త నెఱింగించినందుల కింతకంటె నీ కేమివలయు? కోరు మిచ్చెద. రామ భరతులు నా కొక్క రూపువారలు. రామాభిషేక కథనంబుకంటె నన్యం బొక్కటి యొక్కింతైన నభిమతంబగు శ్రేష్ఠవాక్యంబు నిచేఁ జెప్పంబడుట కశక్యంబైయుండు. సర్వప్రియంబులకంటెఁ బ్రియతమంబగు వస్తు వేదేని గలిగెనేని యారసిచెప్పుము. దాని నొసఁగెద" నన కైకేయీ దత్తాభరణంబుఁ బాఱ వైచి దండతాడిత భుజంగిభంగి సక్రోధయై మంథర కైకకిట్లనియె. "నీవు దుఃఖ మొందని నాకు దఃఖమబ్బు. నీపతి నీపై వ్యర్థస్వాంతము జేర్చి యిప్పు డత్యనుపమ రాజ్య రూపక మహార్థంబుచేఁ బ్రథమ ద్వితీయ కళత్ర మానంబుల నల్లరించె. భర్తతున కయ్యెడి భయంబుం దలంచి యిప్పుడు

దిగులొందుచున్నాను. రామునకుఁ బిదప భరతునకుఁ బదవడి కవలకు రాజ్యలాభక్రమంబు సన్నికృష్టంబై యుండు. ప్రథముండగు రాముండు ద్వితీయుండగు భరతుని హింసించు. రామభయంబు భరతున కట్లు కవలకుఁ గల్గ నేరదు. వివేకశాలియు సచ్చారిత్ర ప్రాజ్ఞుండును గాలోచితకర్తవ్యార్థకారియు నైన రామునివలన నయ్యెడు భావ్యనర్థకరణభయంబునఁ బూర్వోక్తవైశారద్యాది రహితుండగు భరతు నుద్దేశించి పరితపించుచున్నదాన. భరతునకు హితంబును నాకు నీకు సంతసంబును గోరెదవేని నా చెప్పినట్లు కావింపు" మనఁ గైక కొంత సమ్మతించి తదుపాయంబు దెల్పవే యనుడు మంథర మరల నిట్లనియె. "తొల్లి దేవాసుర సంగ్రామసమయంబున నీ భర్త నీకు రెండు వరంబు లిచ్చియుండె! ఈ వృత్తము చనవుపెంపునఁ దొల్లి నెప్పియుంటివి. అవి యిప్పు డడుగుము. ఒకట రాముఁడు జటాజిన వల్కలధారియై పదునాలుగేండ్లు వనవాసము సేయఁ బంపునట్లును, మఱియొకట భరతుని రాజ్యాభిషిక్తుం గావించునట్లును గోరు" మన నాకర్ణకఠోరవాక్యంబులు విని కైక చెవులుమూసికొని "హరిహరీ! ఏతమాటంటివే మంథరా! రాముఁడు నీ కేమి కారామిచేసె? ఇఁక నీ పాపపుఁ బలుకుల వినఁజాల.

క. అనుజుల బంధుల భృత్యుల
  ననవరతముఁ దండ్రివోలె నారసి ప్రోచుఁ

మనరాముఁ డతని యభిషే
చనమునకుఁ దగవఁడగునె? ఓ సకియా! నీకుఁ.

అతఁడు నిజజనవికంటె నన్నతిశయభక్తిం గొలుచు. శాంతుండు. దాంతుండు. అక్రూరుండు. అరిహరుఁడు. అసత్యదూరుఁడు. కరుణామయుండు. ధర్మజ్ఞుండు. శుచి. కృతజ్ఞుండు. జ్యేష్ఠుండు. ధరారమణిం బాలింప సర్హుండు. అతని నడవులకంపి యిటనేమి తారుకొందు? పోవలసిన భరతుండు పోవుఁగాక! ఇఁక నా యెదుట నిలువకు పొమ్మ" అని గద్దించిన నక్కుబ్జ "కైకా! వ్యాధిగ్రస్తునకుఁబథ్యంబు విసంబుగఁ దోఁచినట్లులు నా పలుకులు పథ్యంబులయ్యు నీకు వెగటయ్యె. నీ సపత్ని కౌసల్య, దాసీ! కైకా! యిటురావే! యన్నప్పుడేని రుచింపకుండునా? రాముఁడు రాజైనఁ గౌసల్య రాజమాతయగు. భరతుఁడు రామదాసుఁడును నీవు కౌసల్యదాసివియు నగుట నిక్కంబు. కాని నాఁడు తన రాజ్యమునకు హాని బొరయకుండ మిము దేశాంతరమునకో లోకాంతరమునకో పంపుట నిక్కువంబు.

మ. రమణీ! మున్ను విభుండు నీకు వశుఁడై
లాలించునాఁడిపు గ
ర్వమునంజేసిన యెగ్గులన్నియును దాఁ
బల్మాఱు చింతించి కి

వృ-మదిం దాఁచిన నీ సవత్నియగు న
కౌ-సల్య, రాముండు రా
జ్యముఁ బాలించుచునుండ సేవియు నినున్
సాధింపదే క్రమ్మఱన్.

నీవు నెమ్మదిగ బ్రదుకఁదలఁచిన భరతు రాజ్య శ్రీవిభునిఁగఁ బగతు రాము నరణ్యావాసునిఁగాఁ దలంపు" మని బహుప్రకారంబుల నేర్పుకొలఁది వ్యాపాదనంబునందుఁ జిత్తంబు దగులువడునట్లు బోధింపఁ గైకేయి యెట్టకేల కియ్యకొనియె. పగతు లెంతకుఁ దగరు? స్వనాశమునకైన నియ్యకొందురుగాని సపత్ని సుఖపడుట కోర్వరు.

—:వర గ్రహణము:—

వెంటనే కైక కోపగృహమున కరిగి మలినవస్త్ర ధారిణియై తగురీతి నటించుచుఁ బతిరాక కెదురు చూచు చుండె. దశరథుఁడు రామాభిషేకవార్త కైకకు స్వయముగఁ దెలుపువాఁడై తత్సౌధముం జేరి శయనాగారంబు సొచ్చి యందుఁ బ్రియసఖింగానక శంకించి "నిత్యము మోహనాకారయై నారాక కెదురుచూచు రమణీమణి నేఁడేల యెదురేగదేర" దని కంచుకినడిగి యున్న నెలవెఱింగి ద్విగుణీకృత విషాదుండై లుళితవ్యాకులేంద్రియుండగుచు మెల్లనఁ గ్రోధాగారంబు సొచ్చి యందు విలిప్తగాత్రయై నలతిక పగిదిఁ, బరమోహనార్థంబు ప్రయోగింపఁబడిన మాయ

కరణిఁ, బరిమ్లానమైన పుష్పమాలికవైవడి నసంవృత మేదిని పయిఁ బడియున్నదాని నతథోచితయగుదాని నవలోకించి డాయంజని కరంబులఁ బరిమార్జనంబు గావించుచు "కోకిల వాణీ! నీమనంబు నెవ్వండు నొవ్వంజేసె? నీసాబఁగేలదప్పె? నాపై నేల కినుకజనించె? కారణంబేమి? నీ అభీష్టము దెల్పుము. ఎవ్వనిశాసింతు? ఎవ్వనిఁబాలింతు? ఏయవధ్యు వధియింతు? ఏవధ్యుఁ బరిరక్షింతు? నాసామర్థ్యంబును నీపైఁగల ప్రేమాతిశయంబును విచారించిచూచిన భవన్మనో రథంబు సిద్ధింప సందియంబుగలదే? స్వస్థచిత్తవై నీయభి ప్రాయంబు దెలుపు" మని యనునయింప నతని మదనశర విద్ధునిఁగాఁ గామవేగవశానుగునిఁగా నెఱింగి ప్రతిజ్ఞ చేయించికొని కైక యిట్లనియె.

"నాథా! తొల్లి నాకు బాసచేసిన వరద్వయంబిప్పు డొసంగ వేఁడెద. ఒకట మత్సుతునకుఁ బట్టంబుగట్టుము. ఒకట రాముఁడు జటాజిన వల్కలంబులు ధరించి తాపస వేషియై చతుర్దశవర్షంబులు దండకాటవింజరియింపఁ బంపుము. రాఘవాభిషేక లగ్నమందె పూజ్య యౌవరాజ్య మునకు నాతనయు విభుఁ జేయుము"

కర్ణశూలాయమానంబు లగు దారుణ వాక్యంబుల దశరథుఁ డాలించి నిశ్చేష్టుఁడై చిచ్చుతాఁకునఁ దపించు మహాగజంబుపోలికఁ దపించి నేలంబడిపొరలుచుఁ గొండొక

వడిఁ లబ్ధసంజ్ఞుండై మంత్రనిరుద్ధ మహాకాలాహిమాడ్కి
నిట్టూర్పులునిగుడ్చుచు వ్యాఘ్రింగన్న యుఱ్ఱిచాడ్పున వాలిం
గని మరల మూర్ఛాగతుండై చాలసేపటికిఁ దెలివొంది
"పుత్రమర్దినీ! దుష్టచారిత్ర! కులవినాశిని! నృశంసినీ! ఇట్టి
దుర్వాక్యంబు పలుక నోరెట్టాడె? ఆత్మవినాశనార్థమై
తీక్ష్ణగరళ ప్రథితోరగి నిన్నుఁజేపట్టితి. సతతముఁ దల్లికంటె
నెల్లవిధములఁ బ్రీతిమెయి నిన్నుఁగొలుచు జానకీజాని కహి
తంబుసేయ నేమి నిమిత్తమబ్బె? పుడమినైన రాజ్యభోగం
బులనైన బలగంబునైన భార్యలనైనఁ బ్రాణంబునైన
విడఁతుఁగాని రాముని భానువంశాబ్ధిసోముని రాక్షస విరా
ముని సర్వసద్గుణధాముని విడువఁజాల. విడువఁజాల విడవఁ
జాల! విడిచి త్రుటియైన మనఁజాల. రామునికంటె భర
తుఁడు నీకెక్కుడుఁ బ్రియుండయ్యె. మును రాముఁడు నాకు
జ్యేష్ఠపుత్త్రుఁడు ధర్మజ్యేష్ఠుఁడని నీవ పలుకుచుందువే?
ఆపలుకు లేమయ్యె? అవి మచ్చిత్తవశ్యార్థమని తలంచెద.
దానమున దీనులను, సత్యమున లోకములను, శుశ్రూషత
గురువులను, వింటిచే దుస్సహవైరివీరులను జయించి నిన్ను
నన్ను నెల్లర రంజింపఁజేయు రాముఁడు నీకెట్టి విప్రియంబు
గావించె? తరణిలేకున్న ధరణియు జలంబులేకున్న సస్యం
బులు నిలువవచ్చుఁగాని రాముఁడు లేక నాతనువున జీవం
బులు క్షణమాత్రము నిలువవు" అని కైక చరణంబులం

బడి యంజలి ఘటియించి "ప్రియా! రామునకు శరణంబు గమ్ము. సర్వ సర్వంసహా నీకొసంగెద. రామవివాసంబు మానుము. మామకాంజలి గైకొని నన్నుఁగావుము" అని విన్నఁదనంబున వేఁడు తేని పలుకులఁ బెడచెవినిడి కైక "భూనాథా! ఏలపరితపించెదవు? చెప్పి తప్పుట మీవంశమున లేదు. నాకోర్కె సత్యధర్మయుక్తమైనను, దుర్వ్యతిరిక్తమైనను సరియె. దానికి నన్యథాత్వంబు లేదు. భరతునాన నాకు రామవివాసంబుకంటెఁ బ్రియతమంబు లేదు" అని దారుణంబుగఁ బలుక నయ్యవాచ్యంబుల విననోల్లక మహీపతి 'రామా' యని నిట్టూర్పుపుచ్చి సన్నిపాతంబుచే విపరీతప్రకృతియైన రోగిచందంబున నష్టచిత్తుండై ధరణిం బడి పొరలుచు నిట్లనియె.

తే. గీ. మగఁడనగు నాకు సుతునకు జగమునకును
తప్పక ప్రియంబుగావింపఁ దలఁచితేని
రామవనవాస భరతసామ్రాజ్య రూప
మైన యీపాపభావంబు మానుమబల!

రామోత్సవముఁ గానవచ్చిన నృపులు రాఘవుఁడేల యాలిచే నిర్వాసితుఁడయ్యెననిన నేమని యుత్తరమిత్తు? దాసిపోలిక సఖి యనువున జననిపగిది భగినిచందంబున భార్యలీలనొప్పు కౌసల్య నన్నేమనిపలుకు? అవనిజాప్రియ విప్రియంబు విని సుమిత్ర నన్నెంత విశ్వసించు? విపినవాసి

మైన రాముని, లోకాంతరవాసియైన నన్ను వినుటకు జన
కజ యెట్లోర్చు? నిజముగ సీత వెతలొంది ప్రాణంబులఁ
బాయకున్నె? రాముని వనికిఁబంపి నన్ను దుఃఖమునఁ జంపి
భరతునితో సుఖలీల రాజ్యమేలఁ దలఁచితివటే పాపినీ!
నరుఁడు గరళయుక్త మద్యముం గ్రోలి తపించు మాడ్కి
సతివగు నిన్ను గ్రహించి తపింపవలసె అపథ్యభోజనంబు
విషరోగినింబలె నీయందుఁజేసిన హితంబు నిశితంబై యం
తకుఁ దెచ్చె. బాలుండేకాంతంబునఁ గాలాహిని ముట్టిన
కరణి జడబుద్ధిచే దుశ్శీలా! నినుఁజేపట్టితి. రామా! వనం
బులకుఁ బొమ్మా! యనినంతన యట్లకాక యని చనుఁగాని
యొండనఁజాలఁడు. అట్టి మజ్జీవజీవమును నాసుకృతరాశిని
నెట్లుంపఁగలను? నామాట జవదాఁటువాఁడైన నింత చిం
తింప. పొమ్మనినంత నాయభిప్రాయ మించుకైన నెఱుఁగక
మున్న కాంతారంబు చేరఁగలఁడు. వెంటనే సర్వలోక
ధిక్కారంబు సైఁపఁజాలక యమసదనంబునకు నేఁజనఁ
గలను. తరువాతఁ గౌసల్యాది జనంబుల నేమిచేయఁదలంచి
తివో! నీవలన మద్వంశంబు పరిక్షీణంబయ్యె. రామ సహ
చరుండగుటంజేసి లక్ష్మణుండు రామునితోఁజను. పతివ్రత
యగు సీత రాము ననుగమించు. కుమారప్రవాసంబును
భర్తృమరణంబును దలంచి కౌసల్య ప్రాణంబుల విడువఁ
గలదు. నన్నుఁ గౌసల్యను గుమారులను దలంచి సుమిత్ర

పంచత్వము నొందఁగలదు. ఇట్లు మా యెల్లరచే విడువఁబడిన విధవారాజ్యంబును లబ్ధకామితవై సకుమారవై ప్రాజ్యంబుగఁ బాలింపుము. నాకుఁ బ్రేతకృత్యంబులు సేయ భరతుఁడర్హుండు గాఁడు. భార్యారూపకాలాహివని యెఱుంగక చేపట్టి యిట్లు నీచే వధింపఁబడితి. రామద్రోహివైన నీరసన పెక్కు వ్రక్కలై వ్రయ్యవేల? భవద్దశనంబులు విశీర్యమాణంబులై పుడమింబడవేల? పాపినీ! కులవినాశినీ! రక్కసీ! గ్లాని నధిగమించిన నధిగమింపుము. కోపించినఁ గోపింపుము. నశించిన నశింపుము. అప్రియంబులు నధర్మంబులు నగు నీ వచనంబులు సఫలంబు గావింపఁజాల. క్షురోపమానవు! మిథ్యాప్రియవాదినివి! దుష్టస్వభావవు! స్వకులోపఘాతినివి! అమనోహారిణివి! మత్ప్రాణాపహారిణివి! మద్వంశకాళరాత్రివి! నీవు జీవించియుండుటయు సహింపఁజాల" అని కఠినంబుగాఁ బలికినఁ గైక పదరక పదిలంబగు మనంబున "రాజేంద్రా! ఆడితప్పితిననుము. సభ్యులయెదుటఁ బల్కినది తప్పిన సత్యదోషంబైనచో దేవతాసమక్షంబునఁ బల్కినది తప్పుట సూనృతమగునే? నా మాట గీటునఁబుచ్చి యెల్లి కౌసల్యపట్టికిఁ బట్టంబుగట్టుము. భరతు నూఁతఁద్రోసి నే గరళము గ్రోలి నీ కన్నులు చల్లఁగా మడియుదును. మిథ్యావాదివై పెద్దకాలము మనుము" అని ములుకులవంటి పలుకులు పలికిన దశరథుండు, చేసిన ప్రమాణంబు దలంచి

పరికంపితగాత్రుండై కోపశోకమ్ములు పెనఁగొన, లేవఁ బోయి చదికిలఁబడి, యక్కైకయాననం బాలోకింప రోసి పెడమొగంబు పెట్టి "అక్కటా! ఇంతలో సూర్యోదయం బయ్యె. గురుజనంబు లభిషేకార్థంబు సంభారంబులతో వచ్చి నన్ను వేగిరింతురు. రాముఁ డింతకుఁ గృతాభిషేకుండై యుండఁగలఁడు. మృత్యుదేవతా! ఆ రాముని మోమెకరణి విలోకింతు? నిరానందంబునఁ బౌరజనంబుల నెట్లు లవలోకింతు? ఇంతకుఁ బరిత్యక్త కళేబరుండనైన బాగగునే?" యని ప్రలాపింపఁ గైకరాజును మరల వేగిరించె. ప్రతోదతాడితహయంబుభంగి సారెసారెకుఁ గైకేయీవాక్యచోదితుఁడై "క్రూరకర్మిణీ! ధర్మరూపాధర్మపాశబద్ధుండ నైతి. మద్బుద్ధి ప్రణష్టమయ్యె. యశస్వియు ధార్మికుండును జ్యేష్ఠుండును నగు రాముని జూడఁగోరెద. రావింపు" మని పర్యంకమున మేనువ్రాల్చె.

ఆ సమయంబున సకలసంభారముల సమకూర్చుకొని సశిష్యుండై వసిష్ఠుండు చనుదెంచి సుమంత్రుం గాంచి "లగ్నంబాసన్నంబయ్యె. రాజునకు మా రాక యెఱిఁగింపు" మనిన సుమంత్రుఁ డవార్యగమనంబున నంతఃపురంబు ప్రవేశించి భూపాలుని సమీపించి నిటలతటఘటిత కరపుటుండై ప్రాతఃకాలార్హంబులును బరితోషకారణంబులు నగు స్తుతివాక్యంబుల మేలుకొలుప, రాజులలాముఁ డాలించి యెట్టని

విరితామరలఁబోలు కనులువిచ్చి నష్టహర్షుండై "కైకేయీ క్రూరవచనవికృత్తహృదయుండనైన నన్ను స్తుతివాక్యంబుల నేల పరితపింపఁజేసెదవు?" అని మరల శోకమూర్ఛా పరవశుఁడయ్యె. అతని వదనవైవర్ణ్యంబును స్వరదైన్యంబును బరికించి కారణం బారయనేరకున్న సుమంత్రునకు స్వకార్యోచిత విచారపరిపాక యగు కైక యిట్లనియె. "రాజు రామవిభవోత్సుకుఁడై యీనిసి నిందు జాగరణమొనర్చి యిప్పుడిట్లు కలువరించుచున్నాఁడు. త్వరితగతి నీ వరిగి రాముం దోడ్తెమ్ము" అతఁడది నిక్కంబ కాఁదలఁచి రామసదనంబుఁ జేరి "నరపతి కైకేయీ సహితుఁడై నినుఁ జూడఁ గోరుచున్నాఁ" డన రాముండు సీతతో "వనితా! జనకుఁడు మదర్థంబున నభిషేకపర్యాలోచనంబు సేయు చందంబు దోఁచె. అమ్మహాత్ముని సదనమునకుఁ బోయివచ్చెద" నని యర్థసహితంబుగాఁ బల్కి సుమంత్రునితో నడచె.

పర్యంకంబునఁ బవ్వళించి వివర్ణవదనుండై కన్నుఁగవ మోడ్చి యున్న తండ్రి పదంబుల నిజనామోచ్చారణపూర్వకంబుగా రాముఁడు నమస్కరించి పదపడి కైకేయికి వందనం బాచరించి నిలిచె. దశరథుండు కనువిచ్చి "రామా" యని యొక్కమాఱు పేర్కొని మఱి పలుకఁజాలక పోయెను. బాష్పపర్యాకులేక్షణుఁడై మఱి చూడఁజాలక కనులు ముకుళించెను. అనృతమాడిన మహర్షిపోలిక నిట్టూర్పులు పుచ్చెను. అది గని రాముఁడు భయంబుఁగొని "నిత్యంబు

నన్నుఁగన్న మన్నించు తండ్రి నేఁడేలొకో యిట్లున్నాఁ"డని వితర్కించి విషణ్ణవదనుండై "జననీ! జనకున కేదవిన మనస్సంకటమునకుఁ గారణంబరయ నేరమి నామది కళవళించుచున్నది. తల్లీ! నాయందేదేని కలుషము దోఁచెనే? కాక తక్కిన యేరిచేనైన ననుజ్ఞగావింపఁబడియెనే? జనకునకుఁ బ్రీతిసేయక, యతనివాక్యంబు భక్తిఁజలుపక యిలనే మని వినియోగమేమి? తనపుట్టువునకుమూలమై ప్రత్యక్షదైవతమై యొప్పు తండ్రిని లెక్కసేయని కొమరుండు కొమరుండే? అభూతపూర్వంబైన యీవికారం బేమికతంబునఁ గలిగె? తండ్రిచందంబు దాఁపక చెప్పుము. చెప్పవేని నిముసమేనోర్వఁజాల" అని నయమారఁ బలికిన విని కైక శంకారహితాంతరంగయై యిట్లనియె.

"కుమారా! రామా! భవజ్జనకుండు కుపితుండు గాఁడు. వ్యసనియుఁ గాఁడు. తన మనోగతంబు ప్రియార్హుండవగు నీతో నప్రియంబగుటఁ బలుకఁజాలక దిగులుగొనియున్నాఁడు. నేను జనకునట్లమాన్య నగుటం జేసి నాచే నది పలుకంబడు. అది నీ కవశ్యకర్తవ్యముగదా! తొల్లి దేవాసుర సమయంబున నీ తండ్రి నన్ను మన్నించి వరద్వయంబిచ్చె. అది యిప్పుడు వాంఛింపఁ బ్రాకృతునట్లు పరితపించుచు సకలధర్మమూలంబైన సత్యంబు భవన్నిమిత్తంబు విడువనున్నాఁడు. తత్కార్యంబు తప్పక నెఱ

వేఱునంటి వేని రాజప్రత్యాఖ్యాయముగఁ దెలియఁబలికెద
వనవు కు రాముఁడు వ్యథితుండై "అమ్మా! జననీ జనకుఁ
యాజ్ఞ విపంబు గ్రోలెద. ఆలస్యమేల? ఆజ్ఞయిమ్ము. రాఘ
వుఁడాడి తప్పువాఁడే? తండ్రియు గురుండును నృపుండున
హితుండునగుట నితని వాక్యకరణంబునందు నన్ను సందేహ
విషయీభూతునిగఁ దలంపకుము" అనిన సంతసమంది కైక
మరల నిట్లనియె. "సత్యనిరతా! ఒక వరంబు భరతుఁ
కభిషేకంబు గావించునట్లును, మఱొకట నీవు తపసివేష
మునఁ గానలఁ బదునాలుగేండ్లు నుండఁగోరితి. జనకుఁ
సత్యవాక్య పరిపాలకునిగాఁ జేయఁదలంచితివేని యిప్పుడ
యరణ్యమున కేగుము. ఈవిధంబు నీతోఁ బలుకఁజాలక
యీ రీతి ధరణీపతి దురపిల్లుచున్నవాఁడు"

ఆ పరుషవాక్యంబు లప్రియంబులైనను మహానుభావుండు గావున రాముండు శోకంబు నొందక వదన వైవర్ణ్యాది బాహ్యవికారంబులం బొరయక మొగమునఁ జిఱునగవు మొలకలెత్త జనని కిట్లనియె.

"అమ్మా! నీమనమున దైన్యము విడువుము. ఇప్పుడ వనమున కరిగెద. ఇంతమాత్రము నకుఁ దండ్రి యేల చిం తింపవలయు?

చ. జననివి నీవు వేఁడుదటె!

సత్యము తండ్రికి నెక్కునట్టె! నా

యనుజుఁడు నేల యేలునట!
యక్కడ సన్ముని పాదపద్మ వం
దనమట! కృత్యమిట్లగుట
ధన్యుఁడ నేగెదఁ గాన కేను మీ
పనిచినయట్ల నే భరతుఁ
బట్టముగట్టు సవిత్రి! ధాత్రికిన్.

జననీ! జనకుండు విచారము దక్కియుండ నోదార్పుము. మాతులు నింటనున్న భరతుఁ దోడ్తేరఁ జారులఁ బంపుము"

"రామా! నీ చెప్పినట్ల కావింతు. భరతుఁ డరుదెంచునందాఁక నీ విందుండఁదగదు. మీ తండ్రి సత్యవార ప్రాప్త్య దర్శన సంజాత వ్రీడాభరంబున మొగంబు వాంచి మూర్ఛాక్రాంతుండై సంభాషింపఁజాలకున్నాఁడు. ఇతని సంభాషణంబుం గూర్చి చింతింపఁ గార్యంబుగాదు. నీ వవిలంబగమనంబున నిద్ధరాపతి దైన్యం బపనయింపవలయు. నీ వరుగునంతదనుక భవజ్జనకుండు మజ్జనభోజనాదు లంగీకరింపఁడు" అని వేగిరపడి కైక పలికిన రాముండు ధైర్యధుర్యుండై చలింపక, శోకపరిప్లుతుఁడై పర్యంకమునఁ బొరలు తండ్రిం గ్రుచ్చి యెత్తి సాంత్వన వచనంబులఁ దేర్చుచు వనగమనంబునఁ గృతత్వరుండై "జననీ! నాచేఁ దండ్రికి మత్ప్రాణత్యాగంబున నైన సత్ప్రియం బొనరింప శక్యంబేని

జరపిన వానిఁగా నెఱుఁగుము. తల్లీ! నా కత్యంతనియంత్రి వయ్యు భరతున కభిషేకంబు గావించి వనంబునకుఁ జను మని భవద్వచనకారినైన నన్ను నియోగింపక మహావిభుని నిర్బంధించితివి గావున నాయందు సన్నిహితంబైన యార్జ వౌదార్యాది గుణంబు లించుకయైన నెఱుంగనిదాన వని యూహించెద. మజ్జనని వగపుదీర్చి సీత ననునయించి చను వాఁడ. అంతకుఁ గడువాసంగుము" అని కైకేయీ దశ రథుల చరణంబుల కెఱఁగి తన్మందిరాభ్యంతరసీమ నిర్గ మించి లక్ష్మణుం డె తయుఁ గ్రుద్ధుండై వెనువెంటఁ జను దేర మాతృగృహంబు దారివట్టె. రజనీకాంత రాకాసు ధాంశుని కాంతి మాపలేని కరణి రాజ్యభ్రష్టత యతని ముఖ కాంతి నపహరింపఁజాలదయ్యె. మనోనిగ్రహులకు మానస వైక్లబ్యమేలగల్గు? రామాభిషేక భంగవార్త క్రమంబుగ రాజవీథిం బ్రాఁకి పిమ్మట నూరెల్ల నల్లుకొనియె.

—:కౌసల్యాగృహము:—

కుమారాభ్యుదయంబుకై కృతస్నానయై శుక్లా క్షౌమచేలంబుదాల్చి విప్రులచే మంత్రపవిత్రాగ్నిహో త్రంబునందు హోమంబు సేయించుచు దేవతాసంతర్ప ణంబు గావించుచున్న జననికిఁ గుమారుండు ప్రణమిల్లె. 'అధికవిశ్రుతులైన పూర్వాధిపతుల యశము నాయువు ధర్మంబు నీ కబ్బెడు' మని తల్లి దీవించె. ప్రీతావదనుండై

రాముండు "జననీ! అనివార్యమైన యొక కార్యం బిప్పుడు సంభవించె. ఇది నీకు మున్న తెలిపియుంటి. భరతుఁడు సమస్తరాజ్యం బేలఁగలఁడు. పదునాలుగేండ్లు జటాజినవల్కల ధారినై దండకాటవిం జరింపఁగలవాఁడ. ఇది తండ్రియాజ్ఞ" అనుటయుఁ దడవుగ నమ్మాత పిడుగుంబోలిన యా నుడువు లెడఁద సుడింబాప మహావాతపతితంబైన కదళీద్రుమంబు భంగి నిలపైఁ బడి కుమారు నుపచారములచే లబ్ధసంజ్ఞయై గద్గదస్వరంబున నిట్లనియె.

"నాయనా! అపుత్రదుఃఖముకంటెఁ బుత్రవిశ్లేష దుఃఖంబు దుర్భరంబు. దుస్సహంబు. నినుఁ బాసి జీవంబుల నిలుపనేర్తునే? తండ్రీ! నా యట్టి యభాగ్యవతి కేల జనించి తివి? కైకకు జన్మించియుండరాదె? నీ వియోగవార్తాశ్రవణ మాత్రంబున మదీయహృదయంబు వ్రయ్యలు కాకుంటచేఁ బితృపతి లోకమున నాకు నెలవు లేదని తలంచెద. పిన్న నాఁటనుండి నేఁ జేసిన వ్రత దాన గురు ద్విజ బుధ సేవలు చవుటఁజల్లిన విత్తులట్లు నిరర్థకంబులయ్యె. ఇఁక నా కేది దిక్కు? నీ వెంట నడవులకు వచ్చెద" నని "కుమారుండు సత్యపాశబద్ధుండయ్యె. వారింప శక్యుండుగాఁడు. భావిసంభావిత వ్యసనంబుఁ దలంచిన దుర్భరంబయ్యెడి" నని మది వగచు కౌసల్యం గని లక్ష్మణుం డిట్లను.

"జననీ! పడతుకఁ యాడిన మాటకు రాముఁ డొడం బడి యడవికి వెడలుట పాడిగాదు. పితృవాక్య పరిపాలనం

బననేని తండ్రి కామపరవశుండై కైకేయీ మాయావాగు రాబద్ధుండై పలికిన పలుకులకు సమ్మతించుట వివేకుల లక్ష ణంబుగాదు. రామునియందే దోసమెంచి యడవులకుఁ బంపుట? తండ్రి యెంత సత్యాత్ముఁడు?

క. మదనాతురతం బలికిన
యది సత్యంబఁట! మహా స్రభాంతరమునఁ దా
విదితంబుగాఁగఁ బలికిన
యుదిబొంకఁట! దీఁకింక నేమనవచ్చుఁ?"

అని యన్నదిక్కు మొగంబై "రామచంద్రా! నీ యాజ్ఞ నెవఁడుదాఁటునో చూచెదఁగాక! భరతుసామ్రాజ్య స్థాపనంబు గోరువారల మత్కాలసర్పాభీల బాణజాలం బుల భస్మీభూతులఁ గావించి పుచ్చెద" అని వీరాలాపంబు లాడిన సుమిత్రాపుత్త్రుని వాక్యంబు లాలించి కుమారుని వదనంబు విలోకించి కౌసల్య "తనయా! లక్ష్మణు వచనం బులు నృపవంశాచార సమ్మతంబులు. తల్లిమాట పాటిం చుట నీకుఁ గర్తవ్యంబ" అనిన రాముఁ డులికిపడి యిట్లనియె.

"జననీ! అదికాదిది యానని వాదించి జనకునాజ్ఞ మీరుట నా కశక్యంబు. ప్రాణపరిత్యాగంబుచేసైనఁ బితృవా క్యంబు పరిపాలనీయంబని పెద్దలు వక్కాణింతురు. ఇఁక నీ తుచ్ఛ రాజ్యభోగంబులకా తండ్రి నతిక్రమించుట? మాతా పితృవాక్యకరణంబు తనయు ధర్మంబైనను బితృవాక్యంబు ప్రథ

ము కర్తవ్యంబయ్యె" అని లక్ష్మణు నుద్దేశించి "వత్సా! నీకుఁ గల భ్రాతృభక్తికి సంతసింతుఁ గాని ధర్మవిరుద్ధంబును బితృభక్తికి దూరంబును నగు నీ పలుకులతో నేకీభవింపఁజాల. పురుషార్థంబులలో ధర్మంబు ప్రప్రథమంబు. అట్టిధర్మంబు నందు సత్యంబు నిలిచియుండు. గురు నానతి నడచుట య న్నిఁటికంటె నుత్తమ ధర్మంబు. జననీ జనకుల వచనంబులు శక్తుఁడయ్యు నుచితగతి నొనరింపనివాని నలఘుతర కల్మషాత్ముఁడని మహాత్ము లందురు. నేను జనకుని శాసనంబునఁ గైకేయిచేఁ బ్రచోదితుఁడ నైతి. నీవీ తీక్ష్ణభావంబు మాని మద్బుద్ధి ననుసరింపుము" అని మరలఁ దల్లిం గని "అమ్మా! విపినంబునకు వేపోవలయు. నీవు నా వెంట వచ్చు టుచితంబు గాదు. సభర్తృకలకుఁ బతితోడిది గతి. నా జీవితము లాన నన్ను వారింపకుము. పదునాలుగేండ్లు పదునాలుగు దినములట్ల గడపివత్తు.

క. జననీ! నీకును నాకును
జనకజకు సుమిత్ర కి సౌమిత్రికి గ్ర
క్కున నఁ బతియానతిఁ బోవఁగ
జను నిదియె సమస్త ధర్మ కి సమ్మతముసుమీ!

నా కష్టు సెప్పక దీవించి పంపుమని మ్రొక్కినఁ గొడుకుం గౌఁగిలించి యతని మంగళాభ్యుదయ పరంపరాభివృద్ధి కొఱకు హోమాద్యధికంబులు సేయించి గోభూహిరణ్యాది దానంబు లొసంగి,

సీ. "వృత్రనాశనమందు । నింద్రున కమర న
మాజమిచ్చిన జయ । మంగళంబు
నమృతంబుఁ దేఁబోవు । నహికులారికి విన
తాంగన యిచ్చిన । మంగళంబు
నమృతంబు వడయునాఁ । డదితి దైత్యులగెల్వ
మఘవున కిచ్చిన । మంగళంబు
బలిఁగట్ట నరుగునాఁ । డలవామనున కింద్ర
మాత యిచ్చిన జయ । మంగళంబు
తే. గీ. నీకె యగుఁగాక" యని రఘు । నేతశిరము
నందు మంత్రాక్షలు నిడి । చందనంబు
నలఁది సువిశల్యకరణి ది । వ్యౌషధియును
గుళికగావించి ముంజేతఁ । గూర్చికట్టె.

"కుమారా! పోయిరమ్ము. సుఖివై నీరోగుండవై యశస్వివై తేజస్వివై సమయంబు దీర్చి మరలఁ బురి కరుదెంచి పట్టాభిషిక్తుండవై ప్రజల రక్షించు నిన్నుఁ గన్నులారఁ గాంచెదఁగాక!" యని మఱి మఱి దీవించె.

పిదప రాముఁడు లక్ష్మణునకుఁ జాతుర్యప్రాచుర్యముగ నిట్లను. "అనుజా! కైక భావంబు కృతాంతవిహితమైనది. కానిచో నెన్నఁడు లేని యీపె బుద్ధి నేఁడేల యనివార్యమై మత్పీడ యందు పరిణమించు? దైవంబు బలీయంబు. మఱుమాటాడక నీ విందుండి కౌసల్యా సుమిత్రల

భక్తిం గొలుచుచుండుము” సౌమిత్రి రామవిరహాసంజాత
శోకంబు భరింపఁజాలక యన్న చరణంబుల వ్రాలి “మీ
రొంటరిగ వనంబుల సంచరింపఁ బలుకుఁ దోషులేకుంట
పాడిగాదు. అడవులఁ గార్ముకపాణినై మీకగ్రభాగంబునఁ
దెరువెఱింగించుచు నడతు. పవలు ఫలమూలంబులు దెచ్చి
యిచ్చి రేల ధనుఃపాణినై నిద్రమాని కంటికి ఱెప్పవలెఁ
గాచి మీ సేవచేసి కృతార్థుండనయ్యెద. నారాకచే మీ
కును బాధకంబు లేదు. సేవ్యసేవక ధర్మరాహిత్యంబును
వైపరీత్యంబును లేదు. కాన నా యాగమనం బంగీక
రింపుము. నీవులేని నాకాధిపత్యంబేని యొల్ల. కాదందు
వేని యీ తుచ్ఛజీవితంబు నొల్ల” నని పలికిన రాముఁడు
లక్ష్మణుని రాకకు సమ్మతించె. సుమిత్రయుఁ “దనయా!
రామవనవాస సాహాయ్యంబుకొఱకు నాచే విసృష్టుండ
వైతివి. రామసేవయం దనవధానంబు గావింపకుము.
జ్యేష్ఠవశంగతుఁడై వర్తించు నతనికి సర్వశ్రేయంబులు
ప్రాప్తించు. ఇక్ష్వాకుకులజులకు దానంబును యజ్ఞదీక్షయు
జేష్ఠ్యానువర్తనంబును రణతనుత్యాగంబును బితృవాక్య
కరణమును సనాతన ధర్మంబుల కావున రాముని సేవింపు”
మని పలికి వనవాసంబునందు మాతాపితృ నగరస్మరణం
బున మనశ్చాంచల్యంబు గల్గునేమో యని శంకించి తత్పరి
హారార్థంబు మఱి యిట్లను. “నాయనా! రాముఁడ నీకు

దశరథుఁడు. మాకు మాఱు సీత. అడవియే యయోధ్య. పోయిరమ్ము."

—:సీతాగమనము:—

పదపడి లక్ష్మణుం గని రాముఁడు "నీ వాచార్య మందిరంబునకుం జని యిష్టులకుఁ జెప్పి జనకు యజ్ఞంబు నందు వరుణుం డొసంగిన మహాకార్ముకములును నభేద్య కవచంబును నక్షయతూణీరంబును హేమపరిష్కృతంబగు ఖడ్గద్వయంబును బూజార్థ మచ్చట నుంపఁబడినవాని గొనితె" మ్మని పంచి స్వగృహంబునకుం జని సాక్షతగంధపుష్ప పాత్రహస్తయై భర్త్రాగమనంబు నిరీక్షించుచున్న సీతం గని యేతాదృశ విప్రియం బిద్దేవి కెట్లెఱింగింతు నని వ్రీడానమ్ర వదనుండై నిలిచె. భూమిజయు రాముని ముఖలక్షణం బుపలక్షించి శంకాకలితస్వాంతయై తాలిమి నిల్పఁజాలక యిట్లనియె.

"నాథా! నేఁ డేల మీ ముఖము విన్ననైనది? పూర్ణచంద్ర సదృశమై యుజ్జ్వలమగు శ్వేతచ్ఛత్రము నీ శిరముపై శోభిల్లదేల? చామరములు వీవఁబడవేల? మంగళ తూర్యనిస్వనంబులు సూత మాగధ స్తుతివచనంబులు భూసురస్వస్తి వాచనంబులు వినంబడవేల? మంత్రులు పరమష్ఠులు జానపదులు సామంతులు భృత్యులు నిన్నుఁ బరివేష్టించి రారేల? భద్రగజము నీ మ్రోల రాదేల?

ప్రాణేశ్వరా! నీ వదనంబు చెలువుదక్కి పెనుచింతచే వివర్ణత నొంది మహారాజలక్షణంబు లేవియు గానరావేల? పుష్యమి రాజ్యాభిషేకసమయమని వచింపఁబడిన యార్యవచనంబులు పొల్లయ్యెనే? ప్రియా! ఏల మాటాడవు? నా యపచార మేమి? నా మనంబు తహ తహ పడియెడిని. శీఘ్రంబ తెల్పవే?" యని వ్యథగొన జానకీజాని దిటవూని యిట్లను. "తొల్లి మా తండ్రి కైకకు రెండు వరంబులొసంగియుండె. ఆమె నాఁటనుండి యూరకుండి యిప్పుడు నాకుఁ బ్రవాసంబును భరతునకు రాజ్యాభిషేకంబును గోరె. జనపతి సత్యవాదియు సత్యవిచారుండుగాన భరతునకు రాజ్యమిచ్చి నను బదునాల్గువత్సరము లటవులకుఁబొమ్మన నీకుఁ దెల్పి పోవువాఁడనై యిటకు వచ్చితి. నా వచ్చునందాఁక వ్రతోపవాసంబులు సలుపుచుఁ గాలాతిక్రమణంబు గాకుండ దేవతా సపర్యలు గావించుచు గురుజనంబులఁ బూజించుచు విశేషించి మజ్జనని శోకసంతాపకర్శిత గాకుండ సమ్మానించుచుఁ బ్రాణతుల్యులును భ్రాతలును బుత్త్రసములును నగు భరతశత్రుఘ్నులయెడ వాత్సల్యంబు నెఱపుచు భరతుండు దేశకులంబులకు రాజు గావున నతనికి విప్రియంబు గావింపక ప్రియవాదినివై యుండుము. అనుకూలవృత్తిచే నవనీపతులు ప్రసన్నులగుదురు. గుణహీనులఁ బుత్త్రులనైనఁ ద్యజింతురు. గుణంబు గల్గెనేని యన్యులైనఁ బరిగ్ర

హింతురు. కావున నీవీ యర్థంబు నెఱింగి యెల్లర కను వర్తినివై సత్యవ్రతపరాయణవై ధర్మైకనిష్ఠవై మదాగమ నంబుఁ బ్రతీక్షించుచుఁ గౌసల్యయొద్ద నుండుము. నేఁ బోయివచ్చెద"

అనిన ప్రియవల్లభుని పలుకులు ములుకులై తన యుల్లంబు గలంపఁ గలికి యులికి "ధర్మమూర్తీ! మీ వాక్యంబులు నాకుఁ బరిహాసభాజనంబులుగాఁ దోఁచె. తనయుఁడు, భ్రాత, స్నుష, తల్లిదండ్రులు నాత్మకర్మసంజనిత ఫలంబు గుడువఁజాలి స్వభాగ్యనియుజ్యమానులై మనుదురు. సతియన్ననో భర్తృభాగ్యముం బొంది మనునది. కావుననే భార్యనాఁబడు. మఱియు "అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ" యను వేదవాక్యంబు గలదు. భవదర్ధశరీరభూతనైన యేనును మహీపతిచే వనవాసంబునందు నియోజింపఁబడితి. ఇంతయేల? ఒక యంగంబు నిట విడిచిపోఁగలవే? అర్ధాంగినెట్లు డించిపోఁగలుగుదువు? సతికిఁ బతితోడిదగతి. ప్రాసాదాగ్రంబులకన్నను స్వర్లోకస్థిత విమానంబులకన్నను సర్వావస్థలయందుఁ బతిపాదచ్ఛాయయే యువతికిఁ బరమోత్కృష్టపదంబు. భర్తృసేవయే జన్మకర్తవ్య మని చిన్ననాఁటినుండి వినుచున్నాను. నీవు వనంబున నడచుచో నీ ముంగలఁ గల కుశకంటక పాషాణాదులఁ దొలఁగింతు. నీ మదికి ముదం బావహిల్ల నిచ్ఛావిధి మెలంగుదు. అన్న

పానాది విశేషసంపాదనంబునకు నిన్నుఁ బీడింపక ఫలమూలంబు లాహారించి నీ సేవ సేయుదు. కానఁ గానకు నను నీ వెంటఁ గొనిపొమ్ము. నీ పట్టభంగమునకై చింతింపు. కాదన్నచో దుఃఖవారిధి మునింగి జీవితంబుఁ ద్యజించుట సిద్ధం" బనిన పడతి నుడువుల కెడఁదఁ జింతించుచు నడవులఁ గొడరు నిడుములఁ దలంచి రాముం డిట్లను.

"ప్రాణప్రియా! నీవు కులీనవు. ధర్మవిశారద వగుటం జేసి యింట నిలిచి ధర్మ మాచరింపరాదె? ఏ నెద్ది చెప్పిన నది చేయఁదగు నీకీహఠంబేల?

మ. చలిగాలింబడి నిత్యముం ద్రిషవణ
స్నానంబు గావించుచున్
ఫలమూలంబుల దేవతాతిథి పితృ
వ్రాతంబులన్ భక్తిని
చ్చలుఁ బూజించుచు సంతతవ్రత విధుల్
సంధించుచున్ దీర్ఘ వ
ల్కలముల్దాల్చి వసింపవచ్చునె వనిం
గార్శ్యోపవాసమ్ములన్.

మఱియుఁ గాననము భయస్వరూపము. బహుళ దుఃఖకరము. దారుణనిస్వనభూయిష్ఠము. మహావాతంబులు రజోరూషితంబులై సుడియు. రాత్రుల గాఢతిమిరంబు వ్యాపించు. గిరిసర్పంబులు వక్రమార్గగాములై మార్గం

బుల నావరించియుండు. పతంగ కీటక వృశ్చిక దంశమశకంబు లనంతంబులై నిత్యంబు బాధించుచుండు. కంటకతరువులు వ్యాకులశాఖాగ్రములై యుండు. బాటలు లేవు. గిరిదుర్గ గమనం బగమ్యంబు. నీవు సుఖోచితవు. వివిధ దుర్భర దురవస్థా ప్రాప్తిహేతుకమగు కాంతారవాసంబు నీ కశక్యంబు. మద్వాక్యంబు విని ప్రయాణం బుపసంహరింపుము.

"నాథా! మీ రన్న వెల్ల నాకు మున్న తెల్లంబ. నీ యండనుండు నాకు సంకటంబులు వాటిల్లవు. సాముద్రికులు చిన్ననాఁడే రేఖావిశేషంబు లరసి యీ యతివ పతితో వనవాసంబు గావింపఁగలదని నొడివిరి. అది తప్పునే? అదియునుగాక విపినవాసంబు విషయలోలుపులఁ గలఁచుఁ గాని నియతాత్ములఁ గలఁపఁజాలునే? వనవాసంబు నేఁ జాలకాలమునుండి కోరుచుంటి. అది నేఁటికి దైవాయత్తమునను గైక పుణ్యమునను లభించె. నే నవశ్యము నీ వెంట రావలయు దాన" నని యనేకవిధంబుల నంబుజాక్షి ప్రార్థించి ప్రాణేశు చిత్తంబు మెత్తఁబడకుంటఁ గనుంగొని ప్రణయాభిమానంబుల నీమతోపదీప్తవదనయై "నాథా! పత్నినగు నన్నుఁ బ్రోవఁజాలక వనంబుల కొంటిగ నేగు నిను విని మజ్జనకుండు, జామాత పురుషస్వరూపస్త్రీ యని తలంచుకుండునే? ఇంతయేల? మా తండ్రి రూపమాత్ర పురుషుండవగు నిన్ను స్త్రీగా నెఱుంగక నన్నొసంగె,

శా. అస్త్రీ నేతపతీవ రామనృపతా
వత్యంత తేజఃపరం
చాస్తోకమ్మనుమాట నన్నుచటఁ బా
యంబెట్టి నీ వేగినన్
నా స్త్రీనేతపతీవ రామనృపతా
వత్యంత తేజఃపరం
చాస్తోకమ్మని మ్రొయునింక భువిలో
నార్యాస్య సందీప్తమై.

కులపాంసనినట్లు నన్నుఁ ద్యజింప నీకు ధర్మ్యమే? వంశపరంపరాఖ్యాతయు భర్తృయోగ్యయు సతియు భద్రదయు లలితకౌమారయు నగు నీ స్వరాజ్యలక్ష్మి నితరుల పాలుసేయు నీతియే? అనపాయను గౌమారావస్థా పరిణతను మహాసతి ననఘుజాయాజీవనికరణిఁ బరుల కొసంగందలంచుట పాడియే? నినుఁ గూడినచోటు దుర్గంబైనను స్వర్గంబు. నిను వీడినచోటు నాకంబైనను నారకంబు. నినుఁ బాసి మనుటకంటె నీ యెదుటఁ జచ్చుటొప్పదే?" యని వల్లభుం గౌఁగిలించికొని బిట్టేడువ రాఘవుండు కరుణాయత్తుండై కన్నీటిం దుడిచి "ప్రాణసఖి! నీ వియోగంబున నాకు మఘవు సంపదయైన మది రంజించునే? నీ మది చంద మెఱుంగఁగోరి కావఁశక్తి గల్గియు నష్టంకులు కొన్ని వచించితి. సైఁపుము. నాతో నరణ్యావాసమున కే నిను సుర జ్యేష్ఠుండు సృష్టించె.

ఆత్మజ్ఞుండు ఖ్యాతింబోలె నిన్నుఁ బాయంజాల. నీ యాగమ నం బంగీకరించితి. సువర్చల సూర్యు ననువర్తించిన కైవడిఁ బూర్వావనీధవాచరిత ధర్మం బనుసరింపుము. ఇఁక నీవు వనవాసక్షమంబులగు దానంబులఁ గావింపుము. మన కిరువురకుఁ గల వస్త్రమాల్యాభరణ శయనాసనంబులును క్రీడార్థ సంగ్రహణ జాత రూపమయ కృత్రిమ పుత్త్రికాచయంబులును భృత్యులకొసంగు" మని పలికిన సుగుణమణి ప్రస్ఫీత సీత యట్ల కావించి పతితోడఁ బయనించె. లక్ష్మణుండును బాణాసన ఖడ్గ కవచాదులఁ గొనివచ్చి తన్నుఁ గలిసె.

—:త్రిజటుఁడు:—

మువ్వురుం గూడి గురుపుత్త్రులగు సుయజ్ఞాదులకు వివిధ దానంబులు గావించునంతఁ ద్రిజటుం డను విప్రుండు భార్యా ప్రేరితుండై నిత్యభుక్తిదాయకములగు ఫాలకుద్దాలలాంగలాదులఁ బాఱవైచి వదాన్యరాము నాశ్రయించి "బాలకుల శనాచ్ఛాదనంబులకుఁ బరితపింపఁ బహుపుత్త్రకుండనయిన యేను నిన్నాశ్రయించితి" నన నాశ్రితవత్సలుండు నగుచు "నా మందంగల గో సహస్రంబుల గురుపుత్త్రులకొక్క సహస్రంబిచ్చితి మిగిలినవానిలో నీ దండం బెంతదవ్వు విసరి వైవఁగల వంతదవ్వు నిండియున్న గోజాతంబు నొసంగెద" నన నతండు సంతుష్టుండై కటితటంబున శాటి బిగియించి భుజబలంబుకొలఁది దండంబు విసరివైవ నది సరయూతటంబు

నతిక్రమించి బహుసహస్రసంఖ్యాతంబగు గోసమూహమున నొక వృషభసన్నిధింబడ, నంతదూరము నిండిన గోతండంబు నాతనికొసంగి "వినోదార్థమవలంబించిన కార్యము నకై కనలవలదు. మదుపార్జిత ధనంబు విప్రప్రయోజనంబున కని యెఱుంగుము. ఇంకెద్దియేని కోరిక గలదేని యడుగు మిచ్చెద" నని రఘుపుంగవుండు సమాశ్వాసింప నతని వాక్యంబుల కలరి త్రిజటుండు రాము నాశీర్వదించి గోసమూహముం బ్రతిగ్రహించి నిజాశ్రమమునకుఁ జనియె.

—:వనవాసానుజ్ఞ:—

అంత రాముఁడు సీతా లక్ష్మణ సహితుఁడై తండ్రి యున్నెడకు నడతెంచె. పురంబువా రాబాలగోపాలము దుఃఖంబునఁ దోఁగుచు నతని బరివేష్టించి చనుచుండిరి. సీతా రామ లక్ష్మణు లల్లంత దవ్వున రాఁగని దశరథుండు ధృతిదూలంగి మూర్ఛనుమునింగె. అత్తెఱంగెఱింగి కుమారు లతిత్వరితగతింజని తండ్రిం గ్రుచ్చియెత్తి శయ్యపైఁ జేర్చి వచోమృత సేచనంబులఁ దేర్చిరి. కొంతతడవునకు లబ్ధసంజ్ఞుండై వేఁడినిట్టూర్పులఁ గందిన మొగంబుతోఁ దెలువఱిన తండ్రిం గని రాముండు కృతాంజలియై యిట్లనియె. "జనకా! మమ్మ్ముఁ గృపావలోకనమునఁ గనుము. జానకియు సౌమిత్రియు నాతో వని రానిశ్చయించిరి. మా కనుజ్ఞయిమ్మా!" అనినఁ దనయుని వచనంబులు విని, పట్టరాని నెవ్వగ నివ్వ

టిల్లఁ గురరి క్రియం బ్రలాపించుచు "మద్వంశభూషణా! కైకేయీవర ప్రదాన రూప నిబిడ పాపపాశ బద్ధుఁడనైన సువినీతిదూరుని నను నిగ్రహించి యప్రతిహతంబుగ మహినేలుమా!" యని మరల మూర్ఛాక్రాంతుఁడయ్యె. వివిధ శైత్యోపచారంబులఁ దల్లులుం దానును దండ్రిం దెలిపి "నాయనా! పెక్కువర్షంబు లత్యంత పుణ్యమూర్తివై పుడమి నేలితివి. అట్టి నిను మృషావాదిగా నొనర్పనోప. నీయాజ్ఞ శిరంబున నిడి చతుర్దశాబ్దములు దండకాటవిం జరించి కృతవ్రతుండనై తావకపాదపద్మసేవకై తప్పక రాఁగలను. రాజ్యభోగంబులు సర్వకామంబులు స్వర్గంబు జీవితంబు నీతకంటె ప్రత్యక్షదైవభూతుండవగు నిన్ను సత్యభూతునిఁగఁ జేయుటొండే యిచ్చించెద. సంకల్పిత వనగమనోద్యోగ నివృత్తి నాకుఁ గలుగనేరదు. స్వస్థచిత్తుండవై మమ్మాశీర్వదించిపంపు" మని నమస్కరించిన రాముని జేరఁ దీసి గాఢంబుగఁ బరిష్వంగంబు సేయుచు నయనద్వయము బాష్పపూరితముగాఁగ సాకేతనాథుఁ డిట్లనియె.

సీ. "కులశేఖరుని నన్ను । ఘోరాటవులకు నేఁ
డనిపితినని నన్నుఁ । గనలకన్న!
కైక పాపముగాక । కలుగదు నా పాప
మించుకంతయు నంచు । నెంచవన్న!
మాటజాలముఁ జేసి । మితిమీఱితికలిగె నీ
యుమ్మలమని నీవు । నమ్మవన్న!

సడలించుశోకంబు సాక్షి చాలగయున్న
నేఁ జచ్చినపుడైన నెఱుఁగవన్న!
తే. గీ. మగువ సీతను వదుల నే మాఱకన్న!
పిన్నతమ్ముని గరుణను బెంపవన్న!
మాతలను నన్నుఁ దమ్ముల మఱవకన్న!
భూరియశమున మఱి పురి జేరవన్న!”

పదపడి రామచంద్రుఁడు కైకం గని “జననీ! నార చీర లిచ్చి మముఁ దీవించి కృతార్థులఁజేయవే” యని నమస్కరింప నాయమ వైళముగఁ దెప్పించి యిచ్చె. జనుల మనంబులు సంక్షోభింప సూక్ష్మవస్త్రంబులు పుచ్చివైచి రామలక్ష్మణులు వల్కలంబులఁ దాల్చిరి. తరువాత జగన్నుత శీలజాత రూపమయచేల యగు జానకి కైక యొసఁదిచ్చిన యనుంబుల తాపసచేలంబుల హరిణి వాగురనట్లు కైకొని బాష్పపూర్ణాక్షియై భర్తం జూచి “యిట్టి కకనంపుఁ బుట్టంబు లెట్టులు తాపసులు తాల్పనోపుదు” రని కట్టనేరక యంసమున నొక పరిధానంబును గరంబుల నొక్క వసనంబును బట్టి యూరక నిలుచున్న సుకుమారిం గని కైక తక్కఁ దక్కినవా రెల్ల గొల్లున దురపిల్లిరి. రాముఁడు సీతకు వల్కలంబులఁ జుట్టె. అది గని యంతఃపురకామినులెల్ల రేక గ్రీవముగ నీగోలను నసూర్యంపశ్యను సీతను వనులకుఁ గొనిపోవ యుక్తముగాదని పలవించిరి.

సుమంత్రుండు సిద్ధార్థుండు కైకేయిని మిగుల నిందించిరి. వసిష్ఠుండు కటకట పడి "దుష్టచారిణీ! కైకా! శీలమున్న కపతిని వంచించి సుపుత్త్రు నడవులకు వెడలించితివి. సీత కేల నారచీర లిచ్చితివి? ఈ సీత రాము నాత్మపత్ని గావున రాముఁడు క్రమ్మఱు నం దాఁక ప్రాతినిధ్యము వహించి యీ రాజ్యంబు పాలించు. అట్లుకాక యీ సాధ్వి యడవుల కరిగెనేని మే మందఱము వారితోఁ బోవు వారము. తండ్రిచే ధర్మయుక్తంబుగ దత్తంబుగాని యీ యుర్విం బాలింప భరతుం డర్హుండు గాఁడు. భరతుఁడు నిజముగ దశరథపుత్త్రుఁడేని నినుఁ దల్లివలెఁ జూడఁడు. నీవు మంటినుండి మింటికెగసి మిట్టిపడినను భవన్మతం బంగీకరింపఁడు. రాము ననుసరింపనివాని లేనివానిగాఁ నెఱుంగుము. భరతశత్త్రుఘ్నులును దాపసవేషులై దండకాటవిం జేరఁగలవారు. అంతట సర్వశూన్యంబైన పురంబును నీ నెత్తిపైఁ గట్టుకొని సుఖింపుము. ఈ వైదేహికి దివ్యాంబరాదు లొసంగి వల్కలంబులఁ గ్రమ్మఱఁ బ్రతిగ్రహింపు" మని కైకం బదరి సీతను వారింప నద్దేవి యుడుగక పత్యనుకారకామ గావున వల్కలంబులనే సమ్మతించె. దశరథుం డది గని యెలుఁగెత్తి యేడ్చి "ఓ పాపపరిపాకా! కైకా! ఏలనే నీకీ కాఁక! సీత నీ కేమి యెగ్గొనర్చె? రాముఁ డేమి కారామిచేసె? నీ కిట్టి దురత్యయబుద్ధి యేలకలిగె? పాల

జోలిన కోలఁదు నీఱుగావించితే? కులనాశినీ! నీ నరకాను భవంబుకొఱకు రామవివాసనంబు చాలదే? వెండియు నీ యవాచ్య దుఃఖప్రద సీతా ప్రవ్రజనరూప పాతకంబుచే నేమి యనుభవించెదే? చూడఁజాల. చూడఁజాల. దుర్భరము. దుస్సహము. దురత్యయము. రామా! రామా!" అని కనులుమూసి నేలకొఱగె. తండ్రిం దేర్చి సమ్మానించు చుండుమని కౌసల్యను హెచ్చరింప నతని మునివేషంబు గనఁజాలక 'రామా' యని యొకమాఱు పేర్కొని క్రమ్మఱ నుచ్చరింపఁజాలక యా యమ మేను వ్రాల్చె.

—:వనగమనము:—

పిమ్మట దశరథానుమతంబున సుమంత్రుఁ డాయిత్తము చేసి తెచ్చిన రథంబు సీతారామలక్ష్మణు లధిరోహించిరి. సుమంత్రుండు పగ్గంబులు సడలించి యుగ్యంబులఁ త్వరితగతిం దోలె. దశరథుఁడు పడుచు లేచుచుఁ గొంతదూర మరిగి రామా! నిలు నిలు మనియె. రాముఁడు సుమంత్రుని వేగ తోలుమనియె. ఇరువురవచనమధ్యంబునఁ జిక్కి చక్రమధ్యంబున జిక్కిన పురుషుని క్రియ నాందోళించుచుండె. "సుమంత్రా! 'రాముఁడు నా మాట విన నొల్లఁడయ్యె' నని తండ్రికిఁ దరువాతఁ దెలుపుదువుగాక! త్వరగఁదోలు" మనియె. చూపుమేరదూరము భూరమణుండు రాముని విలోకించుచు రథం బదృశ్యంబగుడు నోద

నంబు సేయుచు నేలకొఱిగినఁ గౌలస్య వలపటఁ గైక దాపటఁ గ్రుచ్చి యెత్తిన దశరథుండు గైకముఖఁ బవలో కించి "కలుషచిత్తా! నన్నంటకుము నీ కరము సోఁక నా శరీరము వాఁడిసూదులఁ గ్రుచ్చినట్లు స్రుక్కె డిని. కౌసల్యా! నీ మందిరమునకు నన్నుఁ గొనిపొమ్ము. ఆ పాపిని యింటఁ జేర్పకుము. నీవ నన్ను స్పృశింపుము. తాపోప శాంతియయ్యెడు" మని కైకను విదిర్చి కౌసల్యా గృహంబునకుఁ జని సెజ్జపై మేను వ్రాల్చి ప్రలాపించుచుండె.

—:పౌరులు:—

పౌరజానపదులు హాహారవంబులు సేయుచు రాముని వెంట నంటి స్యందనంబు మందగతిం బోనిమ్మని సుమంత్రుం బ్రార్థించిరి. రామరథప్రకీర్ణ హయరాజము లార!

చ. రవికులసార్వభౌమునిఁ బ

రాక్రమశీలుని రాముఁ దోడ్కొ బురో

పవనవిహార మార్గిఁ జలు

పక గొనిపోవుటమాని మీరు భై

రవతరసింహముఖ్య మృగ

రాజి విరాజితమైన దండకా

టవికిటు సాహసంబునఁ గ

డంగి వెసంగొనిపోవఁ జెల్లునే?

అని పరిపరివిధంబులఁ బరిదేవనంబుచేసిరి. విప్రుల దీనా లాపంబు లాలించి రాముండు పాదసంచారియయ్యె. తా నెంత

చెప్పిన వినక పౌరులు రాము ననుగమించిరి. వారి యవస్థ గాంచి రాముని వారింప నడ్డంబు వచ్చెనాఁ దమసానది యాసన్నమయ్యె. అంద ఆ యేటియొడ్డున విశ్రమించి సంధ్యాకృత్యములఁ దీర్చిరి. ఆ రాత్రి యచ్చట లక్ష్మణకృత పల్లవతల్పంబున సీతారాములు శయనించిరి. జనంబులు మార్గాయాసఖేదంబున మై మఱచి నిద్రించిరి. లక్ష్మణుండు నిద్రాసుఖంబులఁ బరిత్యజించి విల్లునమ్ములఁ గేలఁ దాల్చి జాగరూకుఁడై నిలిచి కొలుచుచుండె.

అరుణోదయంబున రాముఁడు లేచి యింకను గాఢంబుగ నిద్రించు ప్రకృతి జనంబులం గాంచి లక్ష్మణ సుమంత్రులం జూచి "చూచితిరే వీరి చందము! వలదని వారించిన మన వెంట రాకమానరు. వీరిం గొని చనుట న్యాయంబుగాదు. నిద్ర లేవకమున్న యరదమెక్కి యరుగుద" మని సీతాలక్ష్మణసహితుఁడై రథం బధిరోహించి యయోధ్య తెరువునఁ గొంతదూరము తోలించి పదపడి మఱలించి తపోవనమార్గంబు మార్గంబుఁ బట్టి తరలె.

పదపడి కొంతసేపటికిఁ బౌరవర్గంబు మేల్కాంచి రామునిం గానక శోకోపహతచిత్తంబునఁ జేష్టలు దక్కి "ఆహా! రాముఁ డిట్లు వంచించెనె? తల్లులఁ బాసిన పిల్లల గతిఁ జేసెనే? ఇఁకెందుఁ బోవువారము? శూన్యమై మసనమై తోఁచు నయోధ్య కెట్లుపోదుము?" అని రోదనం

బులు సేయుచు రామరహితపురంబు సొరనొల్లక రథ మార్గంబు వట్టి కొంతదవ్వరిగి మార్గనాశకేబగుట విషాదము నొంది వివత్సలైన మొదవులభంగి విలపించుచుం జంద్ర హీనంబైన గగనంబుపోలికం దోయహీనంబైన సముద్రంబు చందంబున నిరానందమైన యయోధ్య సొచ్చి తమ యిండులకేగ నిల్లాండ్రు గృహమేధులంగాంచి "రాము నట వుల కంపివచ్చితిరే? పరమాత్ముండగు రాముని ద్యజించి తుచ్ఛంబులై నశ్వరంబులైన సతీ సుత సోదర మందిరాదు లపై భ్రాంతిం గొనివచ్చితిరే? సీతా లక్ష్మణులే పుణ్యులు. ఈ పాపజాతి కైక రాజ్యకారణంబున రమణుని గొమరుని విడిచె. ఇంకం బౌరుల విడువనొల్లదే? మనము మరల మరలుదము. మీరు రాముని సేవను మేము సీతాసప ర్యలయందును జరితార్థుల మయ్యెదము. కాదేని రజ్జు విష జలాగ్నులం బ్రాణంబులం దొరంగుద మంతియ కాని వేఱొండు మార్గంబు లేదని భోజన మజ్జన నిద్రాదు లుడిగి యాక్రందించు చుండిరి. తదీయ దుఃఖంబు సహింపని వాఁడు పోలె వారి జ్ఞానసూర్యులతోడ సూర్యుం డస్తమించె.

అట రాముండు గ్రామోప గ్రామంబులు గడచి కోసలదేశాంతంబు దాసి యయోధ్యాభిముఖుండై యారబ్ధ వ్రత నిర్విఘ్న పరిసమాప్త్యర్థంబు పురనిర్గమన సమయం బున శిష్టాచారప్రాప్త పురదేవతా నమస్కారంబునకు సంక

టంబున నవకాశము లేమింజేసి యిప్పుడు కేలుదోయి ఫాలంబునఁ గీలించి "హో పురరాజమా! సురోపురోప మధామమా! నా వ్రతంబు కొనసాగించి పదపడి నిన్నాశ్రయించెద నాసతి" యని మ్రొక్కి యటనుండి చని చని తన చరణంబు కైవశఁ బద్మరేఖాలంకృతయై తన హృదయంబు చందంబున నిష్పంకయై తన దానంబు డంబున బహుజీవనయై తన ప్రయాణంబు వడువున వసుమతీ జాతాభిరామయై యలరు కలితరంగత్తరంగనుం గంగను గాంచి తత్తీరంబున నింగుదీవృక్షంబు క్రింద నా రాత్రి గడపువాఁడై రథంబు డిగ్గి సీతా సహితుండై యధ్యాసీనుండయ్యె. లక్ష్మణు సుమంత్రు లాతని గొలిచి నిలుచుండిరి.

—:గుహుఁడు:—

తత్ప్రాంతశృంగిబేర పురాధినాథుఁడు నిషాద లోక రక్షాపరతంత్రుఁడు భాగవత శిఖామణి గుహుఁడు రాముని రాక యెఱిఁగి యానందపారవశ్యుండై హితాళితో నేతెంచి రాముని దర్శించి యర్ఘ్యపాద్యాదులఁ బూజించి వినయ వినమితోత్తమాంగుండై యిట్లనియె. "రామా! మా కెల్ల నీశుండ వీవు. మేము నీయాన సేయువారము. నీ దర్శన భాగ్యంబున మజ్జన్మంబు ధన్యంబయ్యె. ఏ కారణమున మీ రిట్టి వేషమూనినారలు? ఈ పురం బయోధ్యయట్ల తలంపుఁడు" అని భక్ష్యభోజ్యంబు లిప్పింప రాముండు వలదనివారించి "నిషాద

నాథా! జనకాజ్ఞను వనులలోఁ దాపసవృత్తి నుండ నేతెంచితిమి. కావున భక్ష్యాదులు మాకసంగతంబులు. నీ వినయసపర్యల గ్రహించితిమి. మార్గాయాసంబున డస్సిన తురంగమంబులకు ఘాసపానీయంబులచేఁ దృప్తి గావింపుమన నతఁడట్ల కావించె. సంధ్యాకృత్యంబులఁ దీర్చి లక్ష్మణ దత్తంబైన గంగాజలంబు గ్రోలి సుమంత్ర విరచితమైన పర్ణతల్పంబునఁ బత్నీసమేతుఁడై రాముఁడు పవళించె. అవరజుఁడు కొంత తడవు శుశ్రూష గావించి పదంపడి ధనుర్ధరుఁడై కొలిచి యుండె.

అర్ధరాత్రంబయ్యె. అదంభంబున నిద్ర వేఁగించుచున్న లక్ష్మణుంజూచి సంతాపతప్తుండై గుహుండు "రాకుమారా! మీ సేవకుల మే మిందఱుండ సుకుమారుఁడవేల యిట్లు జాగరణము సేయుదువు? సుఖోచితుఁడవు. నా కెఱుఁగరానిదిందేదియు లేదు. నిర్భయమున నిద్రింపుము. వేగునందనుక నేఁ గాచియుండువాఁడ" ననిన లక్ష్మణుండు గుహున కిట్లనియె.

—:లక్ష్మణసౌహార్దము:—

"[illegible]సత్తమా! చూచితే! భుజగంబులేల నర్హుండు మొనసి పర్ణతల్పమునఁ బవ్వళింప నా కేవిధి నిద్రవచ్చు? నా జీవితమేల? రణమున సురాసురగణములకైన నెదిరింపరాక భీమణుఁడై బలోల్బణవృత్తి నలరు దినమణి వంశ కల

శాఖినిశామణి తృణములపైఁ బరుండఁగంటివే? ఇనవంశ ప్రదీపకుఁడైన యితని వనగమనమున మజ్జనకుఁడు మను మాట సందియంబయ్యె. పితృమరణానంతరము మేదిని యనాథయై తల్లులంద ఱాక్రందించి యలసి నిరానందలై యుందురు. మా తల్లి శత్రుఘ్ను నాశ్రయించి యొకవిధంబున బ్రదికియుండుఁ గాని యేకపుత్త్రయైన కౌసల్య నేఁటిరాత్రి యెట్లు బ్రదుకఁగలదు? వృద్ధుండు ప్రియాగ్రతనయుండు పుత్త్రమోహాంధుండగు మా తండ్రి రామభద్రుండు లేని యీ రాత్రి గడపుట దుర్లభంబు. పపినయాత్రం దలపోసి మృతుఁడైన తండ్రికిఁ దగు సంస్కారము లాచరించి భరత శత్రుఘ్నులు ధన్యులగుదురు. ఆ భాగ్యగరిమయు మాకుఁ గలుగదయ్యె. ఘనతపంబులచే సపురూపముగ మమ్ముఁ గాంచిన జనకుఁ డంచితగతి మనియుండెనేని క్రమ్మఱఁ జనుదెంచి కాంచినపుడుగాదె సమ్మోదంబుగల్గు? ఇదియంతయుఁ దలంచుకొని నా గుండియ లవియుచుండ జోమ్మనఁ జేయిడి యెట్లు నిద్రింపనేర్తు?" అని బాష్పపూర్ణనయనుండై చింతింప గుహుండును గురుసౌహార్దంబువలన సంతాపతప్తుండై కన్నీరునించె.

మఱునాఁడు ప్రభాతంబున గుహుండు లక్ష్మణునాజ్ఞ నావ సిద్ధము చేయించి యవతరణమార్గమున నిలిపి రామునకుం జూపిన నతఁడు నిత్యకృత్యముల నిర్వర్తించి సౌమిత్రి సహి

తంబుగఁ దనుస్త్రాణ తూణీర కృపాణంబులు దాల్చి కో
దండపాణియై వైదేహిం దోడ్కొని పాదచారియై నౌకా
సమీపమునకుఁ జనుచు సుమంత్రుం గని "సుమంత్రా!
భరతుఁడు వీట లేఁడు. తండ్రి విపద్దశ నొందియుండు. నీవు
సత్వర మేగి యతనిం దేర్పుము. మేమిఁకఁ బాదచారులమై
పోఁగల" మనిన సుమంత్రుండు దీనుండై "పుణ్యమూర్తీ!
నీ విట్టి కష్టములకుఁ బాల్పడుటఁగాంచి సత్కార్యంబుల ఫలో
దయంబు లేదని తలంచెద. తమసాతీరంబున నిద్రాసమయం
బున నవిదితమార్గంబునఁ బౌరులును, బలాత్కరించి క్రమ్మ
ఱించుటం జేసి యేనును నీచే వంచితులమైతిమి. ఇఁకఁ బాప
భాగిని యగు కైకకడ నెత్తెఱంగున జీవింతును? నేను
రామశూన్యరథం బయోధ్యకుఁ గొనిపోదు నేని రోదనం
బులు దక్క నన్యంబు నా చెవిఁ జొరదు. నేఁ బోవనొల్ల.
నన్ననుగ్రహించి నీ వెంటఁ గొనిపొమ్ము" అని దీనుండై
వాపోవ జానకీపతి యిట్లను. "సుమంత్రా! నీ వవశ్యము
పురికేఁగవలయు. నిన్నుఁగని కైక, రాముఁడు వనవాసి
యయ్యెనని నమ్ము. జనపతి మిథ్యావాది యను శంక వదలు.
పొమ్ము. అయ్యా! నీకంటె మాకు హితుండు లేఁడు.
తండ్రి కైకేయిచిత్తంబు వడయుకొఱ కెద్ది పంచిన నాఁ గా
దనక యొనర్పుము. తండ్రికి మా వచనంబులుగా నిట్లనుము.
"తండ్రీ! సీతా రామ లక్ష్మణులము నమస్కరింతుము.

నీయనుగ్రహంబున రాజ్యహీనతయు నరణ్యవాసంబును మము దుఃఖితులఁ జేయఁజాలదు. భరతుని శీఘ్రంబరాఁబనిచి రాజపీఠి నిల్పుదువు. నీమనోవ్యథ నతఁడు తీర్పఁగలఁడు" పదపడి మాతల్లులకుఁ గుశలంబులును నమస్కృతులును దెలిపి భర్తతున కిట్లంటినను. "తండ్రి పనుపు సేయు తన యుండుభయలోకసుఖితంత్రుఁడగును గావునఁ తండ్రియానతి రాష్ట్రంబేలుము. తల్లులసముద్ధరింజాడుము" సుమంత్రా! పోయిర" మ్మన నతండు విషాదంబునఁ గ్రమ్మఱెను.

అనంతరము గుహునిచే న్యగ్రోధక్షీరంబు దెప్పించి రామలక్ష్మణులు జడలుదాల్చి నావ నారోహించిరి. రాము పాదంబులు గుహుండు గడిగి తజ్జలంబు మ స్తంబునందాల్చి నావనడపి దక్షిణతీరంబుఁ జేర్చె. అందఱు నౌకావరో హాణుం గావించిరి. గుహుని బహూకరించు తలఁపున రాముఁ డతని యభీష్ట మెద్దియన గుహుఁడిట్లనియె.

ఆ. వె. నీవు దాశరథివి నేను దాశరథిని
నావికులము మనము నాఁట నేఁట
గంగదాఁటఁగా న నుంగ్రైన నాకు సం
సార శరధిదాఁట సాయపడుము.

అని ప్రార్థింప నతని భక్తికి మెచ్చి యట్లకాక యని యతని వీడుకొలిపి సీతాలక్ష్మణులతోఁ గదలి వనంబునఁగల

ప్రకృతిచిత్రంబుల సీతకుఁజూపి సంతసింపఁజేయుచుఁ బోవం బోవ సీత,

క. నడవంజాలక యడుగులు
   తడఁబడ బాగులుచును నోరు దడుపుచు నకటా!
   కడుఁ దూరెననుచు విభుఁడొక
   నెడ నీడల నిలిచి నిలిచి యుభయవిభగమనన్.

అలయకుండఁద్రోకొని నాఁడు మూఁడుయోజనంబులుగడచి సుదర్శనసరోవరతీరస్థ వనస్థలిం గాంచి యచ్చట విడిసి యారాత్రి గడపి మఱునాఁ డుచ్చోటువాసి మూఁడామడలు గడచి గంగాయమునాసంగమస్థలంబుగని ప్రయాగవటంబునకునమస్కరించి భరద్వాజాశ్రమంబుసేరి యతనిచే సత్కృతులై యారాత్రి జరపి మఱునాఁ డతని యనుమతిగొని పయనించి యొక్కింత పశ్చిమాభిముఖాశ్రితయగు కాళింది యుత్తరతీరంబునఁ జని యొకరేవుగని కాష్ఠసంఘాత విరచిత ప్లవంబున నాసూర్యనందిని నుత్తరించి పోయి పోయి క్రోశమాత్రదూరంబున నీలకాననంబవలోకించి దానిం దరించి కంటకపాషాణవర్జితంబును దావపావకరహితంబును నగు మార్గంబున

చ. అటఁజని కాంచిరంత వసు
      ధాధిపులాంరతి లోల కిన్నరీ
   ఘటిత గుహాకుటీ కనక
      కమ్రకవాటము సన్మణిప్రభా

పాటదురుశృంగజూటము న
మావృత మాల్యవతీతరంగిణీ
తటతరుపాటముల్ బహుళ
తాపస కూటముఁ జిత్రకూటముల్.

అందలి చిత్రము లరయుచు నా యత్రి రాజ్యంబెక్కు-మునీంద్ర సంఘంబుల దర్శించి వారిచే సత్కృతు లందుచు వాల్మీక్యాశ్రమమునకుఁ జని యతనికిఁ దమ యుదంతంబు దెలిపి యతని మన్ననలు వడసిరి. పదపడి రాముఁడు లక్ష్మణ నిర్మితంబైన పర్ణశాలం గని నిర్మలోదకములఁ గ్రుంకి నియతుఁడై గృహదేవ వినియుక్తంబులై మంత్రంబుల వాస్తు శాంతి గావించి ఫలమూల మాల్య సలిల దర్భసమిద్గణంబులచే సర్వభూతంబులఁ దృప్తినొందించి సుముహూర్తంబున సీతాలక్ష్మణ సహితంబుగ నంతర్బహిః ప్రాకార భిత్తి ప్రతిష్ఠిత యగు విశాలపర్ణశాలం బ్రవేశించి సుధర్మాభ్యంతరస్థుండైన యింద్రునిచందంబున నొప్పి యున్నతసానువులఁ బుష్పిత ద్రుమకుంజపుంజంబుల నదీతీర పుణ్యప్రదేశంబుల సీతతో సుఖలీలలఁ దేలుచు విహరించుచు లక్ష్మణాభిగుప్తుండై పుర ప్రవాస దుఃఖంబుఁ జేరనీక కాలము గడపుచుండె.

## —:దశరథ మరణము:—

సుమంత్రుండు గంగాతీరంబునఁ గొంత కాలముండి గుహుని చారులవలన రాముఁడు చిత్రకూటాభిముఖుండై

చనుట విని గాఢదుర్మనస్కులై క్రమ్మఱి మూఁడుదినములకు నయోధ్యఁ జేరి. ప్రజలు రామరహితరథంబు గాంచి పొక్కుచు,

చ. "తపములు సల్పియైన బహు
దానము లర్థుల కిచ్చియైన ని
శ్చలతఁ బెక్కుజన్మములు
సమ్మతితో నొనరించియైన నీ
యపరిమిత ప్రభావుని న
నంత గుణాఢ్యునిఁబోలు నాథునిన్
నిపుణత నన్యునిం బడయ
నేర్తుమె యింక జగత్త్రయంబునన్"

అని ప్రలాపించిరి. వారల శోకాలాపంబులు వినుచుఁ దన్ను దూఱుకొనుచు సుమంత్రుఁడు చనిచని నగరువాఁకిటఁ దేరుడిగ్గి లోనికేగె. రామాదర్శనకర్శితలై యంతిపురి కాంతలు వంత గుందిరి. శోకనిద్రాపరవశుఁడై యున్న దశరథు నుచితరీతి సందర్శించి గద్గదికతోడఁ దొడరు పలుంగుల సుమంత్రుఁడు రాముఁ నడవి విడిచివచ్చిన విధంబును రామసందేశమును వినఁబల్కి లక్ష్మణవాక్యంబులఁ జెప్పఁ దలఁపు గొని యిట్లనియె. "ఉచితానుచితంబు లెఱుంగక కపటధర్మముం దవిలి లోకవిరుద్ధంబగు కార్యంబు నొనర్చిన నృపుని లోక మేరీతి విశ్వసించు? సత్యరతుని లోకహితుని జ్యేష్ఠసుతునిఁ

ద్యజించి లోకగర్హితుండవై జగతి నేగతి నేలెదవు? రాముఁ
డే దోషంబుచే వనవాసి యయ్యెనన నేమి యుత్తరమిత్తువు?

చ. సకల జగద్ధితాచరణు
సర్వజగత్ప్రియునిం గుమారునిన్
గ్రకచమువంటి చిత్తమునఁ
గానకుఁ బంచినయట్టి రాజునం
దికఁ గురు బుద్ధిఁగూర్పఁ దగ
దేటికి వేయన నీ మహాత్ముఁడే
సఖుఁడు గురుండు దైవమును
సర్వము నాకుఁ దలంప సారథీ!

అని కోపవేగమునఁ బల్కిన లక్ష్మణు పలుకులు విని భూజాత చిత్రాకృతి నిల్చి యూరుపులు పుచ్చుచు నయనముల నశ్రులు గ్రమ్మదేల నేమియుఁ బల్కక రామ లక్ష్మణుల చందంబు లుపలక్షించుచుండె" అనిన సుమంత్రు వచనంబులు విని యందఱొక్కపెట్టు గొల్లుమనిరి. లక్ష్మణ వాక్యములం దలంచి దశరథుండు తన్నుఁదా నిందించుకొని రోదనంబు సేయుచు,

ఉ. "పిన్నటనాఁటనుండియును
సొక్కు సుఖంబులచేఁ బ్రవృద్ధులై
వన్నియ గన్నపుత్త్రులిటు
వంటియవస్థల కెట్టులోర్చువా

రన్ని యట్టులిడనిమ్మతి సు
ఖార్హ మహాసుకుమార సద్గుణా
భ్యున్నతమైన సీతఁ దల
పోసిన గుండియ చాల ప్రీలెడిన్"

అని మెలుఁగురాల్పడఁ బలవించు కౌసల్యం గని యిట్లనియె. "కాంతా! అత్యుత్కటంబులైన పుణ్యపాపం బులకు నిప్పుడే యనుభవంబు గలదు. తొల్లి యొకనాఁడు వేఁటాడ నడవుల వెంబడిఁ దిరిగి సాయంతనము సరయూ తీరంబునఁ గాచి పొంచి జాత్యంధులైన జననీ జనకులకు జలంబు గొనిపో జనుదెంచిన యజ్ఞదత్తు నన్యాయంబుగా గజంబను బుద్ధిచేఁ గడతేర్చితి. తత్పితరులు పుత్త్రశోకం బున మునింగి ప్రాణంబులు విడుచుచు మావలెనే పుత్త్ర శోకంబున నీవును జత్తు" వని శపించిరి. అది యిప్పటు నాకు సంప్రాప్తించె. నే నిఁక బ్రదుకఁజాలఁ ఎలుఁగు సన్నంబయ్యె. ఎఱుక చెడియె. కనులు చీఁకటులు గప్పె. వీనులు వినరావు. రామవియోగ జనిత శోకానలంబు మునికుమారవధ జనిత దోష స్మరణవాతంబునఁ బ్రజ్వలి తంబై శరీరంబును దహింపఁజొచ్చె. ఆత్మభర దుఃఖంబు నదీరయంబు కూలంబుంబోలె నచేతనుండనైన నన్ను శోషిల్లఁజేసె. కౌసల్యా! నాకు మీఁకు ఋణంబుదీఱె. రామా!

శా. హా కాకుత్థ్స కులాగ్రణీ! గుణమణీ!
హా రామచంద్రా! నినుం
గై కేయీ కృత పాపబోధన కథా
క్రాంతుండనై పాసితిన్
శోకం జేర్పఁడా డంగె నింకఁ బిత్రూరా
జుల గొల్వఁగా నేగెదన్
హా కౌసల్య! సుమిత్ర! హా జనక క
న్యా! హా సుమిత్రాసుతా!

క. హా కులవర్ధన! హా కరు
ణాకర! హా ధర్మశీల! హా గుణనిధి! హా
శ్రీకర! హా జయవర ల
క్ష్మీకర! హా రామ!" యనుచు మేనుఁదొఱంగెన్.

పుత్రవియోగ దుఃఖంబున నడలు కౌసల్య పతి వియోగముం దెలిసి ధృతిసెడి వాతహతవల్లి చందంబున నేలకు వ్రాలె. సుమిత్ర గగన ప్రచ్యుతమైన తారపగిది పుడమిం బడి పలవించె. అంతఃపురకాంతలెల్లఁ బైఁబడి పెక్కువిధంబుల రోదించి తలలు మోఁదికొనుచు,

క. అస్తోక శోకభరమున
దుస్తామసియైన కైక తోఁ గూడి యుటన్
స్వస్తిగలిగి మనియుండుట
దుస్తరమగుఁగాదె! మాకు దుర్దనదూరా!

అని రోదనంబులు సేసిరి. అంతిపురి యెల్ల నాక్రం
దన రవంబులతో గగ్గోలుపడియె.

అంత నమాత్యులు వసిష్ఠాదులచే నాజ్ఞప్తులై పుత్త్రుం
డొక్కరుండైన సమీపంబున లేమింజేసి దహనాది
క్రియలు గావింపక యమ్మహారాజ కళేబరంబు తైలద్రోణి
యందు నిక్షేపించి తగువారలఁ గాచియుండ నియమించిరి.

—:భరతాగమనము:—

ఉడుహీనయైన యామినివడువునఁ బాహుహీనయైన వనిత
యనువున రాజహీనమైన రాజ్యంబు పాడుపడుటం గాంచి
యేడు దినంబులు రాజు లేకున్న రాష్ట్రం బరాజకంబై కీడు
వాటిల్లునని వసిష్ఠుండు తదితర మంత్రిప్రముఖులతో గౌత
మాది మునులతోఁ బర్యాలోచించి "శీఘ్రగతిని జని భర
తుని దోడి తెండు. అతఁ డిటకు వచ్చునంతదనుక నతని కీ
వృత్తంబు చెప్పంజనదు. నా యాజ్ఞ గాఁ బిలుచుకొనితెండు"
అని జంఘాలురగు చారులఁ బంపె. వారును శీఘ్రముగా
బై యేడుదినంబులకు గిరివ్రజపురంబుఁ జేరిరి.

భరతుఁడా నాఁటి రాత్రి దుస్స్వప్నముం గాంచి
మేలుకాంచి శత్రుఘ్ను విలోకించి కళవళమందుచు నిట్లనె.
"తండ్రి యసితవసనము ధరించి యసితపీఠంబునఁగూర్చుండి
నసిత పీతంగ ప్రమదలు నవ్వినట్లును, గొండయెక్కి
క్రొమ్ముడివీడ గోమయహ్రదంబునఁ గూలినట్లును, తైల

వాపిలో మునిఁగి తైలముఁ గ్రోలి తలకంటుకొని రక్తగంధముఁ బూసి రాసభస్యందనమెక్కి పరేతరాడ్దిశ కేగినట్లును నింక నెన్నోవిధంబులఁ దోఁచె. తమ్ముఁడా! నా మనంబు తండ్రిం గాంచఁ దత్తఱించుచున్నది" అని వెఱఁగుపడి పరితపించుచున్న భరతునిపాలికిఁ జారు లరుగుదెంచి సవినయంబుగ నమస్కరించి "రాకుమారా! పురోహితామాత్యులు శుభంబు దెలిపి యచటి పనులు సమకూర్ప మిము నతిత్వరఁ దోడుకొనిరమ్మనిన వచ్చితి" మనిరి. భరతుండు తెలివొంది "మా తండ్రి సుఖుండె? రామభద్రుఁ డానందభరితాత్ముఁడే? ముగురుమాతలకు మోదమే? లక్ష్మణునకనామయంబె? తక్కంగలవారు కుశలులె?" యని యడుగ "మీ రడిగినవారి కెల్లర కావంత భయంబు లేదు. పద్మాకరలక్ష్మి మిము వరియించుచున్నది. వైళంబ పయనింపుఁడు" అని దూతలు తొందఱపెట్టుట నతఁడు శంకాకళంకితస్వాంతుండై మాతామహునకు మాతులునకుఁ దన పయనంబు దెల్పి వా రిచ్చిన వారణాశ్వరథ రత్నరాజిం గైకొని తమ్మునితో రథారోహణంబు సేసె. మార్గ మధ్యంబునఁ గల మహానదుల నదములఁ బురముల వనముల విలోకించుచు నుత్తరించి సప్తాహోరాత్రంబులు పయనించి యెనిమిదవ నాఁటి సూర్యోదయంబున నయోధ్యాపురంబును సమీపించి "ఇందలి యుద్యానవనంబు లిప్పు డేల

నిష్ప్రభ నొందినవి? ఊరడవిం బోలెఁ దోఁచుచున్నది.
మాతంగ తురంగ శతాంగారోహకు లేల యీవ లావలఁ
రారు? కలస్వనంబు లేవియు వినంబడవు. వాద్యఘోషం
బులు సైత మేల వినరావు?" అని సంశయించుచు శత్రు
ఘ్నునకు సారథికిం దెలుపుచు నగరప్రవేశ మొనరించె.
అతని మనము చాలఁ బరితాపమునఁ గళవళించె. నృప
నాశనసూచకములు పెక్కులు కానవచ్చినఁ జిత్తంబునఁ
దొట్రుపాటొంది,

క. సూతా! నిష్కారణముగ
మాతామహు విడిచి మాని మాటకు దూతా
నీతుఁడనై యేనేలా
యేతెంచితి? నిట్టి యశుభ మేటికిఁ దోఁచెన్?

—భరతసౌహార్దము:—

అని చింతించుచు రాజవీథిం జనుదెంచి సమ్మార్జన విహీనంబులై యసంయత కవాటంబులై యుండు భవనంబుల, శోభాహీన జనాకులంబులై యలక్ష్మీకంబులై సొబగు దక్కిన మందిరంబులఁ, బూజాహీన దేవాలయంబులఁ దన్నుఁగని మొగంబు మఱుఁగుపఱచుకొను జనంబులఁ గాంచి భరతుండు కారణం బారయనేరక త్వరితగతిఁ బితృమందిరంబు సొచ్చి యందుఁ దండ్రిం గానక దీనమానసుండై మాతృమందిరంబునకుం జని నిజజననికి వందనం

బాచరించిన నా యమ పుత్త్రుని వాత్సల్యమున నుత్సంగ మునఁ జేర్చి తన వారి క్షేమంబు లడిగినఁ దల్లి కంతయుఁ జెప్పి "జననీ! నీ పర్యంక మేల పాడువాఱినది? మా తండ్రి కుశలియై యున్నచందంబు దోఁపకున్న దేల? అతఁ డెచ్చట నున్నవాఁడు? వేగ తెలుపుము. అతని గానకున్న నా కలత కుదురువడదు" అనినఁ గైక సంశయింపక యిట్లనియె,

"కుమారా! ఎల్లభూతంబుల కేది తుదిగతియో యట్టి చరమగతికి మీ తండ్రి రామా రామా యని పేర్కొనుచుఁ జనియె" తల్లి మాటలకుఁ బృథుపరశు హతంబైన విటపిచందంబున భరతుఁడు నేలకు వ్రాలి శోక కంపితుఁడై "హా! రాజోత్తమా! హా తండ్రీ! మముఁ బాసి పోయితివే! మా కేదిగతి? మమ్మాదరించు వా రెవ్వరు?" అని పొరలుచున్న భరతుని లేవనెత్తి సముచి తాలాపంబులఁ దేర్ప నతండు లేచి

క. ఎవ్వఁడు భ్రాత తండ్రి సముఁ
డెవ్వఁడు రక్షకుఁ డెవ్వఁడింక నా
కెవ్వని కేను దాసుఁడ మ
హీస్థలి నా రఘురాముఁతోఁడ నా
నెవ్వగ లెల్లఁ దెల్పి జన
నీ! రయమ్మారఁగఁ బిల్వఁబంపు దా

దవ్వులఁ జూచి తచ్చరణ
తామరసంబులమీఁద వ్రాలెదన్.

అనినఁ గుమారుని సౌభ్రాత్రంబు విచారించి సంభ్రమింపక కైక యిట్లను. తనయా! రాముఁడు సీతా లక్ష్మణ సహితుండై కానల కేగ నీ తండ్రి తద్విరహదుఃఖంబున నాకంబున కేగె.

భర:—అమ్మా! పరుల సొమ్ము లపహరింపఁడు. అధర్మంబు త్రోవఁబోఁడు. పరదారలపై మనంబు చేర్పఁడు. భ్రూణహునింబోలె మా యన్న కానల కేల పోవలయు?

కైక:—కుమారా! అట్టి యకృత్యంబు చేఁ గాదు. నా కోరికపై నేగె.

భర:—కారణమేమి?

కైక:—మీ తండ్రి నాకు మున్ను రెండు వరంబు లిచ్చియుండె. అవి యిప్పుడు వాకొని నీకు నరాధిపత్యమును రామ వనవాసంబును గోరితి. నా నేర్పుమెయి సంపాదించిన రాజ్యంబునకుఁ బట్టభద్రుండవై నా కన్నులు చల్లఁబడఁ బాలింపుము.

పితృమరణము భ్రాతల వనగమనము విన్నతోడన పిడుగడఁచినగతిఁ బుడమింబడి యొల్లఁబోయి తెలిసి తల్లిం జుఱచుఱంజూచుచు భరతుఁ డిట్లనియె.

"కులఘ్నీ! జనకుని దివికంపి యగ్రజా నడవులకంపి ధర్మము నయము కులము వృత్తము నీఱుగఁ జేసితివే? వ్రణమందు లవణాంబువలె దుఃఖము గల్గించి యేమి సంపాదింపఁ దలంచితివి? యీ తుచ్ఛరాజ్యభోగమా?

చ. అడవుల రామచంద్రుఁడు జ
 టాజినముల్ ధరియించియుండ నేఁ
 బుడమి భరించి భోగములఁ
 బొందఁగలానటె! ఱట్టిచొప్పు లే
 మొడఁ గలవింక నన్ను మొగ
 మేమి తెలుంగునఁ జూతుఁ? బాపపుం
 గడుపునఁబుట్టి యీ భువన
 గర్హ్యుఁడ భ్రాతృఁడనైతి రాక్షసీ!

ఏకపుత్త్రయైన కౌసల్యాదేవిని పుత్త్రహీనం జేసి యేలోకంబు పడయఁగోరితివటే! కులపాంసనీ! ధర్మహీన వైన నీ వింక నన్ను మృతునిఁగాఁ దలంచి రోదింపుము. బంధుసంశ్రయుండు నియతుండు జ్యేష్ఠుండు కీర్త్యసముండు సత్యసంధుండు విశుద్ధచరిత్రుండు సర్వశరణ్యుండు నగు రామునియందు నాకుం గల భక్తిస్నేహంబులు మూఢచిత్త వును, నిజకార్యతత్పరోద్వృత్తశీలయు నైన నీవు పరామర్శింపవైతివి. మహాబలీవర్దంబుచే సముద్ధృతం బగు భారంబు వత్సంబు మోవఁజాలునే? ఉపాయబలంబునఁ

గాని బుద్ధిబలంబునఁ గాని యొక్కింత రాజ్యభారధారణంబు నందు సామర్థ్యంబు నాకుఁ గలిగియున్నను బుత్త్రగర్భిని వగు నిన్ను గామితసిద్ధిచే వెలయింపంజాల. కౌసల్యయందుం బోలె నీ యందు రామునకు మాతృత్వప్రయుక్త గౌరవంబు గలుగ కుండెనేని నిన్నుఁ బరిత్యజింపవచ్చు. అతఁ డంతకంటె నీ యెడ వినయగౌరవంబులఁ బాటించుగావున నత్తెఱం గవలం బించుట యుక్తంబై యున్నది. అక్కటా! కులవినాశంబు గావించి యేమి యొడిగట్టదలంచితివే నరాదినీ!

మ. కరుణం జెల్లెలఁ జూచుకైవడి నినుం
గౌసల్యదా సంతతం
బరుదారం బరికించు నాయమసుతుం
డైశ్వర్య భోగార్హుఁ డి
త్తఱిఁ జీరాజినముల్ధరించి ముని చం
దానన్ వనక్షోణి క
ట్లరుగం జూడఁగ నెట్లు సైఁచితివి వం
శాచార విద్వేషిణీ!

మాతృరూపంబునఁ దోతెంచు మృత్యుదేవతవీవు. నీతో సంభాషించుటయు నిన్నవలోకించుటయు మహా పాతకంబు.

మ. నినువేభంగుల దూఱనేఁటికిఁ గుల
ఘ్నీ! యిప్పుడే పోయి రా

మునిఁ గల్యాణ గుణాభిరాము నిటకుం
బాల్పొందఁ దోడ్తెచ్చి గ్ర
క్కున సామ్రాజ్యమునందు వేడ్క నభిషి
క్తుం జేసి యప్పాలికిఁ గై
కొని యే నేగెద దండకాఖ్య గహన
క్షోణీస్థలిం ద్రిమ్మరన్.

కౌసల్యకు ద్రోహంబు చేసిన పాతకంబునకు మరణంబు దక్క నొండు ప్రాయశ్చిత్తంబు లేదు. చిచ్చున నుఱికియైన గరళంబు గ్రోలియైన నురిగొనియైన నెట్లైనఁ జచ్చి యీ పాపంబుఁ బాపికొనుము. ఏను రామసేవాపరతంత్రుఁడనై యపనీత కల్మషుఁడ నయ్యెద" అని యచ్చోట నిలువక పోఁబోవు తఱిం బొంచి వినుచున్న మంథర నంతఃపురకాంతలు శత్రుఘ్నునకుం జూపి దీని దుర్మంత్రంబున నిన్ని యనర్థంబులు వాటిల్లె ననవుడు నతఁడు రోషావిష్టుండై పెలుచ దానిం బడఁదాఁచి కేలం గడకాలువట్టి మీఁది కెత్తి గఱగఱం ద్రిప్పి నేలవ్రేసిన నది కుయ్యిడఁ గైక యడ్డంబు వచ్చె. 'విడువుఁ డిప్పాపజాతి కైక తలఁ ద్రుంతు' నని ఖడ్గంబంకించినఁ గైక భయభ్రాంతచిత్తయై భరతు మఱువు సేరె. భరతుఁడు శత్రుఘ్నుని వారించుచు

క. "మనమీ కైకన్ గుబ్జను
జనదూషిత వృత్తలంచుఁ జంపితిమేనిన్

ఘనధార్మికుఁ డగు రాముఁడు
గని విడువఁడె మపల మాతృ కే ఘాతుకులనుచున్.

కావున రామునియందు మనకుఁ గల భక్తివిశేషంబు నం జేసి వీరిని విడిచిపుచ్చవలయు" ననిన శత్రుఘ్నుండు భ్రాతృభక్తి భరిగ భయంబునఁ దనకుఁ గలిగిన క్రోధం బుప సంహరించుకొనియె. ఆహా! వారి సౌభ్రాత్రంబు వర్ణింప మనకుఁ దర మే?

అనంతరము భరతుండు శత్రుఘ్నుం దోడ్కొని కౌసల్యా గృహంబున కరుగుచు "నవరజా! కౌసల్య కీ నా మో మెట్లు చూపఁగలుగుదు? పుత్రశోకం బపారంబుగదా! అక్కటా! కైక కడుపునఁ బుట్టి యెంతనింద నొడిఁగట్టుకొంటి?" నని యామెం జేరఁబోయి తచ్చరణములకుఁ జాఁగిలి యేడువఁ దొడంగిన నా కౌసల్య శోకావేశంబున భరతుంగని యిట్ల నియె. "భరతా! నీకై కైక పడరానిపాటులు పడి భర్తను స్వర్గమున కంపి నా పుత్త్రునకు నారచీర లిచ్చి కారడవుల నుండఁ బంచి రాజ్యంబు సంపాదించి యిచ్చెఁగాదె? ఇఁక నాలస్యము లేక నీ శీలము మీ యమ్మశీలము లోకమెఱుఁగఁ బాలింపరాదె? నా యెడ నిన్నినాళ్లు నీకుఁ గల గౌరవముచే నైన నన్ను రామునికడఁ జేర్పుము" అని గర్హితవచనంబు లాడిన నవాక్యంబులు తీవ్రవ్రణంబునందు వాఁడిసూదులు గ్రుచ్చినట్లైనఁ బెనుమూర్ఛ మునింగి కొంతవడికిఁ దెలి వొంది శపథవాక్యంబుల నిట్లనియె.

—:భరతుని శపథములు:—

జననీ! అకల్మషచిత్తుని నన్ను గర్హింతువే? కైక కాకున్న నీవైన రామునియందు నాకుఁగల భక్తి యెఱింగి యుండు వనుకొంటినే! అమ్మా! రామద్రోహికాచార్య నిగదిత శాస్త్రశిక్షిత ఘనబుద్ధిగలుగకుండుఁగాక! సూర్యున కెదురుగ మూత్రించిన వాని పాపంబును, బడియున్న యావును బాదతాడనము సేయువాని పాతకంబును, సేవకు నిచేఁ బనిగొని భృతియీయని వాని పంకంబును, బుత్త్రుల పగిదిఁ బ్రజలఁ బ్రోచు ప్రభునకు ద్రోహియైనవాని యఘంబును, గురూపదిష్టంబు విస్మరించినవాని వృజినంబును, గురుజనావమాన మొనర్చినవాని కలుషంబును, మిత్త్రుండని గోప్యంబు సెప్పినఁ బ్రకటము సేయువాని కిల్బిషంబును, రామద్రోహి కగుఁగాక! శిష్టాచార ద్వేషి, లోకాపకారి, యాత్మహంత, శిశుహంత, స్త్రీహంత పోవు గతులకు రామద్రోహి పోవుఁగాక! ఉభయసంధ్యల నిద్రించువాని పాపంబును, గృహదాహకు కిల్బిషంబును, గురుతల్ప గమనుని కల్మషంబును, పితృమాతృ శుశ్రూష గావింపనివాని కలుషంబును, గరగుని వృజినంబును, బాలవత్స యగు గవిం బిదికినవాని యఘంబును, వివాదంబునఁ బక్షపాతంబు పూనినవాని దురితంబును రామవివాసన కార్యకరునిది గాకే! ఎవ్వని యనుమతంబున రాముఁడు వనంబులకుఁ

జనియె నట్టి పాపి బహుపుత్త్రుండు దరిద్రుండు రోగి సురాపానరతుండు నపాత్రదానియుఁ గామ క్రోధాభిభూతుండు నున్మత్తుండును సంత్యక్త కులధర్ముండును మూఢుండును ధర్మదారాపరిత్యాగియును బరదారాపహరణుండును మాయావాదియుఁ గపటాత్ముండు నై సత్పురుషుల లోకంబు వలనను సజ్జనుల కీర్తివలనను సదాచారుల కర్మంబువలనను విడువంబడి కపాలపాణియై యమంగళుండై భిక్షాచరణంబు సేయుచు మహీచక్రంబునఁ బరిభ్రమించుచుండుఁ గాక. మఱియు నతనికి స్వకళత్త్రులయందుఁ బుత్త్రోదయంబు లేకుండుఁగాక. మఱియు నతని సమస్తవిత్తంబు దస్యులచే హరింపంబడఁ బుత్ర దారా గృహ క్షేత్ర ధర్మహీనుఁడై దుర్మరణంబు నొందుఁగాక! వానినాలుక ప్రీలుఁగాక!” యని యేతాదృశంబులగు దారుణశపథంబులఁ బలికి నిట్టూర్పులు పుచ్చుచుఁ బతిపుత్త్రవిహీనయై దుఃఖించుచున్న కౌసల్యాచరణంబుల పయిఁబడి యుచ్చైస్స్వరనాదంబున రోదనంబు సేయుచున్న భరతు నవలోకించి యద్దేవి యిట్లనియె.

మ. “భరతా! నీశపథోక్తి సంజనిత శుం
భద్దుఃఖతాపాగ్ని న
న్మరలం గాల్పఁ దొడంగె నీమదికి స
మ్యగ్భ్రాతృధర్మంబు సు
స్థిరమై యున్నది నీయెడన్ ముదిత సం
దేహంబు లేదింకను

గరణించేటికి లెమ్మి సజ్జనుల లో
కంబింక నీకయ్యేడిక.

శోకంబు మానుము" అని బోధించిన భరతుండును నా రాత్రి దుఃఖంబుతో వేఁగించె. మఱునాఁ డుదయంబున వసిష్ఠుండు భరతునింగని "కుమారా! నీ శోకంబుమాని నీ తల్లుల కూఱటంబలుకుము. తండ్రికి దహనాది సంస్కార క్రియల నెఱవేర్పుము" అనిన భరతుండు స్వస్థస్వభావుఁడై తైలపక్వంబైన తండ్రి శరీరంబుం గని "తండ్రీ! రాము నడవులకంపి నీవిట్లు దివికేగిన నిఁక రాజ్యభారము వహించు వారెవ్వరు? హా దివాకరాన్వయ సుధాకరా! ఏల నన్నుఁ గన్నెత్తియైనఁ దిలకింపవు? కైకేయీ పుత్త్రుఁడనియా? నన్నుఁ గనకున్నమానె. నిర్దోషియగు సుమిత్రాపుత్త్రుండు పలువిధములఁ బలవింపఁ బలుకకున్నావేల?" యని రోదనంబుసేసి వసిష్ఠునిచేఁదేఱి శాస్త్రోక్తక్రమంబు బుఱ్ఱ్విక్పురోహితాచార్యుల ముందిడికొని ద్వాదశాహంబు లుత్తర క్రియలు పూర్తిగ నిర్వర్తించె. పదుమూఁడవనాఁడు వసిష్ఠుండు పట్టంబు గట్టికొమ్మనిన భరతుండు చింతించి

ఆ. వె. "రాజసమ్మతుండు ౹ రఘుకుల తిలకుండు
రాముఁ డన్నయగుట ౹ రాజు ధరణి
కతని పూనికఁబూని ౹ యడవిలో నొక్కెడ
నధివసించువాఁడ ౹ నన్నియేండ్లు.

కాని రాజ్యం బంగీకరింప" నని శపథంబుచేసి

చ. అఱమఱ యింతలేక చతు
రంగ బలంబులఁ గూర్చుఁ డల్లి త
త్పరత ఘనాభిషేచనిక
భాండము గైకొని కానకేగి సు
స్థిరమతినందె రాము నభి
షిక్తునిఁజేసి కడంగి పీటి క
ధ్వరముననుండి పావకుద్రు
వంబుగఁ దెచ్చినభంగిఁ దెచ్చెదన్.

తెరువులు చక్కఁబఱుపుఁడు. సైన్య మాయత్తము చేయింపుఁడు" అనిన పలుకులకు నంద ఱాశ్చర్యంబును సంత సంబును బొందిరి. కర్మకారులు వనంబున రాజమార్గంబు గావింప మున్నేగిరి. రథాదికంబులు సంసిద్ధము చేయఁ బడినవి.

—:భరత విపినయాత్ర:—

మఱునాఁడు భరతుఁడు రాముఁడ్రోషి తేరఁ బయలు దేఱె. అవ్వార్తవిని పురస్త్రీజనంబులు తమతమ వల్లభులఁ బ్రయాణంబున కుద్యుక్తులంజేసిరి. మంత్రి పురోహిత సామంత బంధు సుహృజ్జనంబులు శతాంగమాతంగ తురంగంబు లెక్కి భరతుని ననుసరించిరి.

తే. గీ. భరతుశాసనమున రామ ॥ భద్రుఁజూడఁ
కలిగె నని మేనఁ బులకలు ॥ గ్రమ్మ దేర
వేయిభంగుల భరతుని ॥ వెంటఁజనిరి
వీరువారన కమ్మెటి ॥ వీటివారు.

ఇట్లందఱుం బయనించి నాఁటి సాయంతనమునకు గంగాతీరమ్ముఁ జేరి శృంగిబేరపురప్రాంతమ్మున విడిసిరి.

—:గుహుని సౌహార్ద్రము:—

భరతుని రాక గుహుం డెఱింగి తన వారితో

మ. "ధనకోశంబును దుర్గముల్ బలము హృ
ద్యంబైన సామ్రాజ్యముం
దనపాల్చేసి పితృఋణమీఁగుటకుఁ గాం
తారోర్వి వర్తింపఁ బో
యిన నా మిత్రుని రామభద్రు మరలన్
హింసింప సాటోపుఁడై
పనిగా నేగెడు సేనతో భరతుఁ డీ
పాపాత్ముని గంటిరే"

వీని నరికట్ట మన కశక్యంబుగాన గంగ రేవుల నావలు లేక చేయుఁడు. ఒక్కొక్క యోడలోనే నూఱుగు రుండి తీరప్రదేశంబు లరసియుండుఁడు. భరతుఁడు రామ ప్రియుం డగు నేని క్షేమంబున గంగం దరింపనిత్తము" అని వారిం బనిచి మధుఫలాదులఁ గానుకగాఁ గొని భరతు

నొద్దకుఁ జనుచుండ నల్లంతన వచ్చు గుహుం గాంచి సుమంత్రుండు 'రామమిత్రుం డీ గుహుండు నిను జూడ నరుదెంచుచున్నాఁ' డనియె. అంతలో గుహుండు భరతుని సమీపించి కానుక లొసంగి పూజించె. భరతుండు నిజాగమనకారణంబు వివరింప గుహుండు సంతసించి యిట్లనియె. "అప్రయత్నలబ్ధమైన సాకేత రాజ్యంబు నవలఁ ద్రోచిపుచ్చి సౌభ్రాత్రంబుం బ్రకటించి ధన్యుండవైతివి. నీ కొరు లీడుగారు. లక్ష్మణుండు రాముఁడు నిలచినచోటిదియ. లక్ష్మణకృత పర్ణతల్పం బిదియ. ఇందు సీతారాములు శయనింపఁ ధనుఃపాణియై కనుమూయక రేయెల్ల లక్ష్మణుఁ డన్నంగాచి నిలుచుండె. ఆతనింగని జాలివడి యే నెన్నివిధుల 'నా కావలి నా కావలి కభేద్యం' బని యుడిగింపఁ జూచిన నుడుగక కన్నీరు నించి "ముజ్జగము లేలఁ దగిన మేటి యాకుసెజ్జఁ బరుండి యీ విధినుండ నా కేరీతి నిద్రవచ్చు" నని యేతాదృశ కరుణా సౌహార్ద వాక్యంబులాడి పరిదేవనంబు సేసె" నని పలికిన విని భరతశత్రుఘ్ను లుచ్చైర్నాదంబున 'రామా! పాపిని కైక కారణమున నిట్టి వంతలఁ గుడుచుచుంటివి తండ్రీ!' యని రోదనంబుచేసి తృణతల్పంబుగని "మంజులశయ్యఁ బవ్వళించు సుఖోచితమూర్తి యీ పర్ణతల్పంబున నెట్లు పరుండె?" యని శోకమూర్ఛాపరవశులైరి. పదంపడి కౌసల్యాదులచే

భరతశత్రుఘ్ను లూరార్పఁబడుచు నెట్లో యా రాత్రి వేఁగించి యుదయమున గుహునిచే సంసిద్ధములైన యోడల నెక్కి గంగానదిం దరించి గుహుని చారులవలన రాము గమనమార్గంబు వట్టిపోయి భరద్వాజాశ్రమంబు సేరిరి.

భరద్వాజ మహర్షి భరతుని రాక శంకించి "నాయనా! అగ్రజుని యనామయరాజ్యలక్ష్మిం గైకొని యంతటఁ బోక యాధర్మమూర్తిపై దండెత్తివచ్చితివే? అతని పుడమి మీయమ్మ గొనఁగా నతనిజీవితము నీవు గొనఁ దలంచితివే? ఇంతేల! కాంతతో గాంతార వాసముసేయ నొప్పికొని వచ్చిన రామునిది తప్పుగాక నీదేమున్నది?" అని రామవిషయ స్నేహబంధంబునఁ బలికిన పలుకులు కొఱవిచే మఱువుగాల్చినట్లైన భరితుఁ డశ్రుపూరిత నయనుఁడై కరములు మోడ్చి యిట్లనియె. "అనఘాత్మా! సర్వజ్ఞుఁడ వీ వెఱుంగనిది లేదు. మంథరాప్రభవంబై కైకయీ గ్రాహసంకులంబై దుర్వార ఘోరవరదానమయమైన శోకసాగర మిట్లు నను దరిగాననీక ముంచుచుండ నీ వాక్యములచే నిజంబుగ హతోపజీవితుఁడనైతి. సత్యధర్మానురక్తుఁడగు నాజతనయుఁడనై వసిష్ఠ శిక్షితుఁడనై రామునకుఁ దమ్ముఁడనై యుండియుఁ గైకకుఁ బొడమిన కారణమున నిట్టి నిందకుఁ బాత్రమనైతి" అని యాక్రందింప భరతుని స్వాంతం బెఱింగి భరద్వాజుండు జాలిగొని

యతనికి నతని సర్వసైన్యములకుఁ గామనందిని వలన విందు వెట్టించి చిత్రకూటమార్గంబును రాముని యాశ్రమస్థానంబును దెలిపిన భరతుండు సంతసించి యతని సెలవంది యాదటఁ గూడికొని మఱునాఁడు పయనించి చిత్రకూటంబు సేరె.

అట్టిసమయమున లక్ష్మణుండు ఫలార్థియై యొకవృక్షమెక్కి దూరమున వచ్చు సైన్యముం గాంచి యందు ఘన రథాగ్రస్థిత కోవిదార కేతనంబువలన నది భరతుని సేనఁగా నెఱింగి రామునకుఁ బ్రాంజలియై "యన్నా! వేగిరపడుము. వహ్ని నరణ్యారోపితుం జేసి సీత నద్రిబిలమునఁ జేర్చి శర చాప కవచ ధారణము గావింపుము. భరతుఁడు కృతాభిషేకుండై నిను జయింపఁగోరి బలంబులతో నేగుదెంచుచున్నవాఁడు. అక్కటా! ఎంతద్రోహి! కైకమాట విని వచ్చు నితఁడవశ్యము వధ్యుండు. ఆర్యా! నాకుత్తరువిమ్మా. మచ్ఛరాగ్రంబు కాఠిన్యమో వాని రక్షఃపీఠి కాఠిన్యమో గనుఁగొనెద. భవద్రాజ్యాపహారియుఁ గృతఘ్నుఁడు నగు భరతుని వధించిపుచ్చెద" అని భ్రాతృసౌహార్ద్యబలంబునఁ గ్రోధాభిభూతుండై పలికిన లక్ష్మణు పలుకుల నాలకించి శ్రీరాముఁడు లక్ష్మణా! ఆగ్రహోదగ్ర వ్యగ్రాయమాన మానసుఁడవుగా నవసర మేమికలిగె? సమగ్ర బాహుబలంబున భరతుని విగ్రహించి నిగ్రహింపఁ దివురు

ఁటల? ధర్మోత్తరుండును మహాప్రాజ్ఞుండు నగు భరతుండు చనుదేర శరచాపములతో నేమిపని? బంధుమిత్ర క్షయంబునఁ బ్రాపించునది సుధయైన గరళమిశ్రితభక్ష్యంబు పగిదిఁ బరిత్యజింపవలయు. అయ్యో! సుగుణాభిరతుని మత్పద సేవానిరతుని భరతుని వధించి యేమి యశము సంపాదింపఁ జూచితివి! బాల్యమాది భ్రాతృవత్సలతయందు నా బుద్ధి పరిణమించు టీ వెఱుంగవే? వత్సా! భరతుడు నీచే నప్రియంబును నిష్ఠురంబును నగు వాక్యంబు పలుకం బడఁదగినవాఁడు కాఁడు. నీ కంటె భరతుఁ డెందుదక్కువ? ఒక్క కోపంబునఁ గాక! అతఁడు తల్లి నవమతిపఱుపఁ దలంచి రాజ్యము నా కొప్పగింపవచ్చుఁ గాని వేఱొండు గాదు" అని సాంత్వనవాక్యంబులు నొడివిన యగ్రజు నొడు వులకు లక్ష్మణుండు లజ్జాతిశయంబున సంకుచితగాత్రుండై సాలంబు డిగ్గి యన్న పార్శ్వభాగంబునఁ గొలిచి నిలిచి యుండె.

—:శ్రీరామసందర్శనము:—

భరతుఁడు సేనను దూరమున నిలిపి పాదచారియై శత్రుఘ్నునిఁ గూడి యరుగుదెంచుచు, "రాముం డెంతలో నా కగపడునంతదాఁక, నెంతలో రుచిరసింహాసనమున మణిమకుటాభిరామ శిరస్కుండై యొప్పునంతదనుక, రామ పదంబు లెంతలో సేవింప నను వుపడు నంతవఱకు నా మదికి

శాంతి గలుగనేరదు. మనకంటె నగ్రజ సేవాపరతంత్రుఁడైన లక్ష్మణుండు ధన్యుండుగాఁడే" యనుచు రామాశ్రమంబు సమీపించి యందొక వేదికపై సీతాసమేతుఁడై జటాధరుఁడై వల్కలాంబరుఁడై యున్న రఘూత్తము నల్లంతన చూచి ధైర్యము దఱుఁగఁ గన్నుల నీరు దొఱఁగఁ దమ్ముని గని యిట్లనను.

కటకటా! అనుదినము భృత్యామాత్య పురోహిత సామంత జానపదులచే నభినుతుఁడగు ప్రభుండు నేఁడు దుష్టమృగజాలముచే దుష్ప్రవేశమైన వని నుపాసితుఁడయ్యె. ధర్మసంచయ మెవ్వనికి సముచితాధ్వరంబులచే యుక్తమయ్యె నట్టి పుణ్యుఁడు నేఁడు ధైర్యమూఁది శరీర దుఃఖ సంభూత ధర్మంబు నొనరించుచున్నాఁడు.

సీ. రమణీయ చీనాంబ । రములు ధరించువాఁ
డీ చీరవల్కల । మెట్లుదాల్చె?
విమల విచిత్ర మా । ల్యములు వహించువాఁ
డీ జటామండల । మెట్లు దాల్చె?
మహిత చందనకర్ద । మంబు మై మెత్తువాఁ
డీ ధరిత్రీ రజ । మెట్లు మెత్తె?
నెండకన్నఱుఁగక । యింటవసించువాఁ
డీ ఘోరవనవాస । మెట్లొనర్చె?
తే. గీ. నతి సుఖోచితుఁడగు రాముఁ । డకట! మన్ని
మిత్తమున నిట్లు దురవస్థ । మెలఁగవలసె

నీచమతినైన నాకు నిందితములైన
జీవితము లేల ఛీ! యెంత చెట్టనైతి?

అని యనివార్య శోకపరీతుండై భరతుండు శత్రుఘ్ను నితో రాము నుపకంఠమునకుం జని రోదన మొనరించుచు నతని పదసమీపముల వ్రాలి దుర్భరదుఃఖభరంబున 'అన్నా' యని యొకమా ఱుచ్చరించి మఱి పలుకంజాలండయ్యె.

రామభద్రుం డతి ప్రయత్నంబున నతని భరతు నిఁగా నెత్తింగి నిజకరతలంబున గ్రుచ్చి యెత్తి వారల గాఢం బుగఁ గౌఁగిలించి తొడలపై నిడికొని కన్నీరు దుడుచుచు వారి వేషపరిస్థితికి వగచుచుం దన్నుం దా ననునయించు కొనుచు నిట్లనియె. "అన్నా! భరతా! వృద్ధుండగు మన జనకుం డెటనున్నవాఁడు? అతని విడిచి యిటు కేల వచ్చితివి? మీ రిట్లు వచ్చిన నతని నుపచరించువా రెవ్వరు? నీవు బాలుండవు. రాజ్యభారంబు చక్కఁగ నిర్వహింతె? తండ్రిని సేవింతె? తల్లుల నాదరింతె? బ్రహ్మసము గుణ గరిష్ఠు వసిష్ఠుం బూజింతె? మాత్రుల మన్నింతె? అందఱ కనామయంబె? కాలంబున నిద్రించుచుం గాలంబున మేల్కనుచు నిశాకాలంబున నిశ్చలార్థంబు నాలోచింతువె?" యని కుశలప్రశ్నావ్యాజంబున రాజధర్మంబు లుపదేశించు నన్నం గని సుహృల్లాభరతుండగు భరతుం డిట్లను. "ఆర్యా! నీ వుపదేశించిన నృపధర్మంబులు ధర్మాత్ములకుం గాక

ధర్మచ్యుతుండనైన నా కేల? మన వంశమున జ్యేష్ఠునకు రాజ్యంబును గనిష్ఠుల కతని సేవయుఁ గర్తవ్యంబు. నీవు ధరింప నర్హ్వాముకు రాజ్యంబు నే ధరింపఁజాల. నన్నుఁ గరుణించి లోకనిందకు గుఱిసేయక చనుదెంచి పట్టంబు గట్టుకొని మా చేఁబనులుగొనుము. మీరు మువ్వురు వనులకుఁ జనుదేరఁ బ్రోలువెడలు నాఁటఁగోలె నేను రాకమున్న,

మ. నినుఁ జింతించుచు నిన్నె పేరుకొనుచు
న్నీయందుఁ జిత్తంబుఁజే
ర్చి నినుంగూర్చి బహు ప్రకారముల వి
క్షేపించుచు న్నీముఖా
బ్జ నిరీక్షాస్పృహుఁడై భవద్విరహ సం
జాతాగ్నిచేఁ గ్రాఁగి నీ
జనకుం డంతయు నస్తమించె జననీ
సంఘంబు శోకింపఁగన్"

అనుటయుఁ దడవుగ దారుణవజ్రహతిచే విపక్షంబై క్షితింగూలు కుధరంబు నా ధరజారమణుండు ధరణిం ద్రెళ్లి తమ్ముల శైత్యోపచారంబులఁ దెలివొంది "హా! జనకా! మమ్ము నిరాశ్రయులఁ జేసి దివి కేగితే! 'సువృత్తా! రామచంద్రా!' యని సన్నాదరపూర్వకంబుగఁ జీరువా రెవరు! నీవు లేని యయోధ్య కేవిధి రానేర్తు! సీతా! నీమామ

యస్తమించె! లక్ష్మణా! పితృహీనుండవైతే!" యని పలు పలువిధములఁ బ్రలాపించె. అన్నం గని తమ్ములును సీతయు వగలఁ బొగలిరి.

తదుపరి రాముఁడు భార్యానుజులతో మందాకినిం బ్రవేశించి తత్పుణ్యసలిలంబులం గ్రుంకి జలంబులు దోయిట గ్రహించి "జనకా! మద్దత్తమైన యీపావనోదకంబు నీకక్షయమై యొప్పుఁగాత" మని సలిలక్రియ గావించి బదరీమిశ్రితంబైన యింగుదీపిణ్యాకంబిడి "పృథివి నేయన్నంబు పురుషుండు భుజియించునో యతని పితృదేవతలు తదన్నులగుదురు గానఁ దండ్రీ! నాయొసంగిన యన్న మింపుతో భుజింపు"మని విధిప్రకారంబుగాఁ బిండప్రదానంబు గావించి పర్ణకుటీరంబుఁ జేరె. తరువాతఁ దల్లులు వసిష్ఠుఁడు మంత్రులు పౌరులు సైన్యము రాముని గలిసె. కౌసల్య సీతను గని వారి దురవస్థలకు మిగుల దురపిల్లె.

తనవలె జటాజిన ధారి యగు భరతునిఁ గాంచి రాముఁడు "తమ్ముఁడా! తాపసివేష మేల తాల్చితివి? రాష్ట్రం బరాజకంబు గాకయున్న నీవరిగి తల్లిని దండ్రిని నన్ను సత్యసంధులఁ జేసి రాజ్యంబును మహితరీతిం బాలింపుము. సర్వధర్మజ్ఞుఁడవగు నీకు విశేషించి చెప్పవలయున దేమిగలదు? తండ్రి వాక్యం బనుల్లంఘ్యము" అనిన భరతుఁ డిట్లనియె.

"అన్నా! పాపిని కులవిధ్వంసిని యగు కైక నిన్నడవి కరుగుమని యన్నమాత్రన వేఱొండు తలంపక రాఁజెల్లునే? నీరాజ్యలక్ష్మిని నేఁ బాలింప నసమర్థుఁడ.

సీ. ఒకపాము మోవంగ నోపునా భూమిని?
　　　శార్ఙ్గివ్రముఁ జేతి బలిమిఁ గాక!
యిలకెల్లఁ దలదండ చెలియలి కట్టయే?
　　　రాజాజ్ఞ నబ్ధిపై రాదుగాక!
వేదంబులా వర్ణ వృత్తి కాధారంబు
　　　జనపతి పాలనా శక్తిగాక!
యినరశ్ములా వెలుం గీలోకమున? కేశు
　　　తీవ్ర తేజోదీప దీప్తిగాక!
తే. గీ. గొడుగువిఱిగిన ధారుణి గూలు, నబ్ధి
　　　మేరదప్పు, వర్ణాశ్రమా చార మడఁగుఁ,
　　　గలయదిఙ్మ్లానమగు, నట్లు గాకయుండ
　　　భూరి ధారణీభారంబుఁ బూనుమధిప!

నిన్ను రాజ్యంబున నుంతునని సభికులయెదుటఁ దల్లితో శపథంబు గావించితి. నినువిడిచి మనఁజాల. కాదంటివేని యిప్పుడ ప్రాయోపవేశము సేయుదు" అని కుశాస్తరణమున కుద్యుక్తుఁడగు భరతుని వారించి రాముఁడిట్లను,

వత్సా! మన కులాచారధర్మంబులు విచారింప కున్నావేమి? మృత్యువెన్నటికేని తప్పినది కాదు. కావున

ధర్మమెల్లర కవశ్యాచరణీయము. నీవు రాజ్యంబుపాలింప నేను దాపసవేషమునఁ గానల నివసింపఁ దల్లిఁగోరె. తండ్రి సమ్మతించె. తల్లిదండ్రుల యాజ్ఞనెఱవేర్పఁ గుమారులకుఁ గర్తవ్యధర్మము. ఇందులకుఁ దప్పితిమేని ధర్మవ్యతిరిక్త పాపపంకమగ్నుల మగుట నిక్కువము. అదియుఁగాక లోకులు 'రాముఁడు రాజ్యలోభముచేఁ దమ్ముఁడు ప్రార్థించిన మాత్రమునఁ దండ్రిమాటఁ ద్రోసిపుచ్చి రాజ్య మంగీకరించె. రాజ్యలోభులు చేయరాని కార్యములున్నె?' యని యాడిపోయరే? నన్ను లోకనిందకు గుఱిసేయ నీకు న్యాయమే?" యని నయమారఁ బలికినఁ దనమాట విని శోకావేశంబున భరతుండిట్లనియె.

ఆ. వె. గహనవాసమేడ? క్షత్త్రధర్మంబేడ?
జడలు దాల్చుటేడ? జగతిఁబ్రోచు
టేడ? రఘువరేణ్య! యిట్టి విరుద్ధ ధ
ర్మంబు నాచరింప రాదు నీకు.

బాలుఁడ జ్ఞానహీనుఁడ నపండితుఁడ దుర్బలుఁడ నీమఱుంగున దాసభూతుండనై యుండ నర్హుండ భవద్విహీనుండనై రాజ్యంబెక్కరణిం బాలింపనేర్తు? నీపాదములాన నీవు రాకున్న లక్ష్మణుంబోలె నీవెంట వనులనుండువాఁడ. నాకు వచ్చిన లోకనిందకు గుఱిగాఁజాల. నన్ననుగ్రహింపుము. నీవయోధ్యకు రాననుమతింపకున్న నారాక కనుమతింపరాదే? లక్ష్మ

ణుని వలె నే నరుఁజుండఁగానే? నేమహాపాపినే? నీ సేవాభా గ్యము నాకుఁ బ్రసాదింపరాదే?" యని యతని పదంబుల పంటుంబడి యాక్రందింప నందఱు గొల్లున దురపిల్లిరి.

రాముఁడు కొంతతడ వేదియుఁ బలుకక యూరకుండి మరల ననునయంబున నిట్లనియె. "నాయనా! భ్రాతృవత్స లత మెయి నీవాడినందులకుఁ గొఱంతలేదు. దశరథపుత్త్రుం డవై నా తమ్ముఁడవై ధర్మవిరోధము లాడుచుంటివే? యని చింతించెద. మన తండ్రి మా తల్లిం బరిణయకాలంబున రాజ్యశుల్క యని కైకొనె. మఱియు దేవాసుర సమర సమయంబునఁ దండ్రిచేఁ దల్లికొసంగఁబడిన వరద్వయం బును నిం దారోపింపఁబడియె. తండ్రిచే నియుక్తుండనై తమ్మునిచే మానఁజాల. నీవును దల్లిదండ్రులచే రాజ్యపాల నంబునందు నియుక్తుండవై భవజ్జ్యేష్ఠుఁడనగు నాచేఁ బలు కంబడిన యీకార్యమును మానరాదు" అనిన నానొడువు లాలించి జాబాలి యను ముని యిట్లనియె.

"దేహికి సుఖదుఃఖంబులే స్వర్గనరకంబులై యుండు. శాస్త్రంబుల నిశ్చయార్థం బెఱుంగలేక వలసిన చందంబున జనంబులు వాదించుచుందురు. ఇవియన్నియు ననుమానోప మానార్థాపత్తిజ్ఞానంబులు. వ్యవసాయాత్మకంబైన జ్ఞానంబు ప్రత్యక్షంబు. ప్రత్యక్షజ్ఞానంబెల్లవారికిఁ దెల్లంబు. కావున నీవు పరంబు వేఱలేదని నిశ్చయించి ప్రత్యక్షసిద్ధంబైన రాజ్య

భోగాదికంబు ప్రతిగ్రహించి పరోక్షంబు పిఱిందికిం ద్రోవుము. స్వజనసమ్మతంబైన బుద్ధిం బురస్కరించుకొని భరతునకుం బ్రసన్నుండవు గమ్ము" ఆమాటలనిరసించుచు రాముండిట్లనియె.

"పథ్యసమ్మిశ్రమైన యపథ్యంబుబోలె నీ వాక్యంబులు గర్హితంబులు. సత్యరూపకమైన యసత్యమునకు లోంగి ధర్మసూత్రంబుల నెఱుంగలేక మోసపోవంజనదు. 'యద్య దాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరోజనాః' యను న్యాయము ననుసరించి మహాత్ములు చన్న త్రోవలే మనకు ననుగమ్యం బులు. చూడంబడనివానిం జూపుటకే కాదే శాస్త్రంబు లుంట. పరోక్షంబు మిథ్య యని పరిహరించి ప్రత్యక్షం బంగీకరించిన శాస్త్రంబు లప్రమాణంబులగు. ప్రత్యక్ష ధర్మంబె పరమార్థం బయ్యెనేని స్వజనంబులకు సామా న్యంబు గలుగు. దానంజేసి జ్ఞానాజ్ఞానంబులు లేక వర్ణా శ్రమాచారంబులు విడిచి జనంబు లిచ్ఛాప్రకారంబు వర్తింపంగలరు. అక్కారణంబున లోకంబంతయు సంకరంబై చెడు. బుధుండగువాండు నాస్తికవాదశీలున కాభిముఖ్యం బొసంగందగదు" అనిన రామునిబదపడి వసిష్ఠాదులు యుక్తి యుక్తమ్ముగఁ బ్రార్థించి విఫలులైరి. మరల భరతుండిట్లనియె.

"ఆర్యా! జనకుని వాక్యం బవశ్య కర్తవ్యమేని మత్ప్రతినిధిత్వమున రాజ్యమేలుము. త్వత్ప్రతినిధిత్వమున నే నీ రేడేండ్లు వనవాసి నగుదు.

రాముఁ డిట్లనె. వనవాసకరణ శక్తిమంతుండ నను నాకుఁ దగిన పనియ కైకయేర్పఱిచె. వత్సా! తండ్రి వచనంబులు సార్థకంబు చేసివచ్చెద. నీవు నా వచనమునఁ దండ్రిని సత్యవాక్యునిఁగాఁ జేయుము.

మహర్షులు కొందఱప్పుడు భవితవ్య మూహించి యున్నపనుపుసేయఁ దగుదువని భరతునికి బోధించిరి.

భరతుఁడు రామునిఁ గని "అన్నా! మత్పాపబలంబున నా మొఱలు వ్యర్థంబు లగుచున్నవి. ఎమ్మెయినైన నీ చిత్తంబు మరలింపలేనైతి. వెరవులిఁ కేల? నా ప్రతిజ్ఞయుఁ జెడక నీ ప్రతిజ్ఞయు జెడకయుండునట్లాగున నీ పాదుకాద్వయం బొసంగుము. భవత్పాదుకా ప్రతినిధినై యుక్షీణ క్షితి యోగక్షేమంబు పాదుకలకు విన్నవించుచు నీ రాక వేచి యుందు. నీకు మాటాడరాదని యిట్లొనరించెద.

తే. గీ. వాసవోపమ! సమయాంత వాసరమునఁ
గనులపండువుగా నిన్నుఁ గాంచనేని
సొరిదిమండెడు చిచ్చులోఁ జొచ్చువాఁడఁ
జంద్రసూర్యాగ్ను లొక్కట సాక్షిగాఁగ"

అనవుడు భరతుని భక్తి కలరి శ్రీరామచంద్రుండు తన పావల నొసంగె. సంతతశ్రీదములై దుర్గుణవిచ్ఛేతములై సుగుణామోదములై యొప్పు రాము పాదములకు భరతుండు నమస్కరించి పాదుకలఁ గొని మస్తకంబుననిడి ప్రదక్షిణించి

సెలవంది శత్రుంజయంబను పట్టపుటేనుంగు కుంభస్థలంబుపై నప్పాదుక లుంచి తానును శత్రుఘ్నునితో నిరుగెలంకుల ఛత్ర చామరంబులు ధరియించి కొలుచుచుఁ బయనించిరి. తల్లులును దదితరులును రాముని విడువఁజాలక పల్లటిల్లిన, వారి నందఱ నానుపూర్వ్యముగ నభిమానించి ప్రయాణంబున కొడంబఱచి దుఃఖితుండగుచు సీతా లక్ష్మణులం గూడి రాముఁడు పర్ణశాలం బ్రవేశించె.

భరతుండు ససైన్యుండై మరలి భరద్వాజున కంత వృత్తాంతముం దెలిపి గుహుని శృంగిబేరంబున నిలిపి

—:పాదుకాభిషేకము:—

పరిజనంబులతో నయోధ్యాపురంబు సొచ్చి రామరహిత పురంబున నుండ రోసి సమస్తజనానుమతమ్మున నంది గ్రామముం జేరి,

తే. గీ. "అడవినుండి యేతెంచిన యగ్రజునకు
నీ యయోధ్య నీ సామ్రాజ్య మీ సువర్ణ
పాదుకాద్వయ మర్పించి పరమభక్తి
యుండఁ గొల్చెద ధూత పాపాళి నగుచు"

అని నిశ్చయించి తాపసవేషియై కందమూల ఫలాశనుండై కుశశయనాసనుఁడై రాముఁ డడవినున్న భంగి నుండి పాదుకల సింహాసనమ్మున నిడి ప్రకృతిమండలంబు నవలో

కించి యిట్లనియె. "రామదత్తంబైన హేమరత్న భూషిత పాదుకాద్వయము మన యోగక్షేమము వహింపఁగలదు. ఇవియే రామచరణములు భవజలధిసంతరణములు. అఘసంహారణములు. మునిమనోలంకరణములు. శ్రుతవిహితాభరణములు. సతతాదరణములు వీని భజింపుఁడు. చామరంబులు వీవుఁడు. ఛత్త్రంబులు వట్టుఁడు. జాగరూకులై కొలువుఁడు. సేవింపుఁడు. భావింపుఁడు. ధ్యానింపుఁడు ప్రేమింపుఁడు. పూజింపుఁడు. సంతసింపుఁడు. సుఖింపుఁడు"

చ. అఖిలనృపాలలోక మరు
దంద నిజాన్వయ కీర్తిచంద్రికల్
నిఖిలము గప్పియొప్పనయ
నిర్భరతన్ భరతుండు పాదుకా
ముఖమున రాజ్యభారము స
ముజ్జ్వలభంగి వెలుంగ భూప్రజా
సుఖములొనర్చుచుండె గుణ
సుందరుఁ డగ్రజు శాసనంబునన్.

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ.



